ప్రచురణము ౧.



# సంస్కారిణి

అను

# సంఘ సమస్య

ఇందు, బ్రహ్మసృష్టి, కలియుగ ప్రారంభము, కలిమహారాజు దర్బారు, కలియుగ బ్రాహ్మణుల స్థితి, బ్రాహ్మణేతరుల స్థితి, పంచముల యిక్కట్లు, తాగుబోతుల పరాభవము, భోగమువారి దుర్వృత్తి, వ్యభిచారుల దురవస్థ, హిందూ మహమ్మదీయుల సమ్మేళనము, హిందూ క్రైస్తవుల పశ్చాత్తాపము మున్నగునవి సులభశైలిలో చక్కని పద్యములతో వివరముగా వర్ణింపబడినవి.



గ్రంథకర్త

## దామరాజు పుండరీకాక్షుఁడు.

గుంటూరు.



చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

1922



వెల రు 1—0—0

# అంకితము

తే॥ గీ॥ అన్ని మతములకును మూలమనగవచ్చు,
నన్ని సిద్ధాంతముల కూటమనగవచ్చు,
నన్నిటికి మించ మతరాజమనగవచ్చు,
నట్టి హిందూమతంబున కంకితంబు॥

దామరాజు పుండరీకాక్షుడుగారు

గ్రంథకర్త.



శ్రీ వేంకటేశ్వర పుస్తక భాండాగారము, నందిమంగళం

[ సేలం జిల్లా, వారిచే ప్రసాదింపబడినది ]

# తొలి పలుకు

పాఠక మహాశయులకు వందనములు.—

అయ్యా,

రెండు మూడు నెలలనుండి, తా మెదురుచూచుచున్న గ్రంథమునకు తుదకిప్పుడు వెలువడు ప్రాప్తము లభించినది. ఆలస్యమునకు కారణము లనేకములున్నవి. కాని వాటినిప్పుడు వివరింపక విడిచెద, ఆలస్యమునకు నా పోషకులు సభ్యులు క్షమింప ప్రార్థితులు.

ఈ గ్రంథమునకు ప్రారంభమున ప్రపంచ సృష్టివిధానమును జూపి, అప్పటి నరులలో నన్యోన్యానురాగములఁ గనపరచితి. పిదప క్రమక్రమముగా కలియుగము గడచినకొలదిని పాపమెట్లు పెరిగినదియు గనపరుపఁబడెను. వర్ణాశ్రమ ధర్మములు నశించుటయు, వర్ణభేదములు వైరములు తీవ్రముగా వ్యాపించుటయు, తాగుడు, వ్యభిచారము సంఘమును పాడుచేయుటయు, పంచముల దుస్థితి దుర్భరమగుటయు, క్రమముగా జూపఁబడి, ప్రస్తుతమహనీయులయొక్కయు, ముఖ్యముగా మహాత్మా గాంధిగారియొక్కయు సద్బోధలవలన సంఘమున గలిగిన మార్పును, దేశీయుల సంస్కార ప్రయత్నములును, ఆ ప్రయత్నముల ఫలితమును విపులముగా వర్ణింపబడి తుట్టతుదిరంగమున ముఖ్యపాత్రలందరు గలసి తాగుడుమాన్పించుటలో జయమొంది లోకకల్యాణ మొనరించి జగన్మాతకు మంగళము పాడుదురు. ఇందు బ్రాహ్మణులను గాని బ్రాహ్మణేతరులనుగాని వేశ్యలనుగాని మరియెవరినిగాని దూషించు నుద్దేశము లేదు. అందరియందునుగల చెడును సామాన్యముగా వర్ణింపఁబడినది. ఇందలి పాత్రలయెడ పక్షపాత మెంతమాత్రమును లేదు. లోపములకు మన్నింతురుగాక! పాఠకులు ముందు తప్పొప్పులపట్టిక జూచి సవరించుకొని తదుపరి పుస్తకమును చదువవలెను. చాల [illegible]లుంచుడు.




ఇట్లు విన్నవించు,
గ్రంథకర్త.

# నాటక ప్రదర్శకులకు సూచనలు

ఇందు రాజకీయములు లేవు గానప్రీతివారును ప్రదర్శించి సంఘసేవకు తోడ్పడెదరుగాక! నాటకము బాహుళ్యమని కొందరికి తోచవచ్చును. అట్టివారు ప్రథమాంకమును పూర్తిగావిడిచి వేయవచ్చును. ద్వితీయాంకమునుండి ప్రారంభించి చివర 5 అంకములు ప్రదర్శింపవచ్చును. ఇందువలన కొద్ది మందిపాత్రలతో నాటకమాడవచ్చును. ప్రథమాంకము విడిచివేయుటలో నాటకోద్దేశమున కేమియు భంగము కలుగదు. ఆ అంకము విడిచివేయుటయే మంచిదని గూడ నాయభిప్రాయము. ద్వితీయాంకము, అనగా కలియుగాది నుండి యిప్పటివరకు సంఘస్థితి ప్రదర్శించుట సమంజసముగా నుండును.

ఇంకొక విషయము :— పంచమాంకములో నాలుగవ రంగమును, అనగా ఆచారసిద్ధాంతి వగయిరావారు దక్షిణాఫ్రికానుండి తిరిగి వచ్చి నందునికలుసుకొనుట, షష్ఠాంకములో మొదటి రంగముగా ప్రదర్శించవలయు. అనగా, మహమ్మదు మస్తాను రంగమును ముందు ప్రదర్శించి తదుపరి వెనుకటి రంగమును ప్రదర్శింపవలయు. ఇది పొరపాటువలన అట్లు ముద్రించబడినది. అవుసరమైనచో పంచమాంకములో మొదటిరంగమునుగూడ విడిచివేయవచ్చును. ఇతర వికారము లేమియు కలుగనేరదు. సమర్థతగలవారందరు విరివిగ వాడుకొనవచ్చును. నాటక ప్రదర్శకులయిష్టముచొప్పున తాము గడించుధనములో కొంతదేశీయోద్యమములకు సమర్పించి కృతార్థులైనచో చాలసంతసింతుము. ఈ నాటక ప్రదర్శనము మహాజనుల కుపయోగకారియై, వారి కానందముగూర్చునని గట్టిగాఁ జెప్పగలము.

ఇట్లు విన్నవించు,

గ్రంథకర్త.

# నాటకమునందలి పాత్రలు

## ప్రధాన పురుషులు

ధర్మసిద్ధాంతి
ఆచార సిద్ధాంతి
నందుడు
ఖుశాల్‌రావు
నాగరత్నం
కొమ్ముల చౌదరి
ఓబయ్య శాస్త్రి
సాంబయ్య శర్మ
మహమ్మదు మస్తాన్
బ్రహ్మ
రావునాయుడు

## స్త్రీలు

జగన్మాత
యామినీ సుందరి
మాలక్ష్మి
లక్షవత్తుల రాజమ్మ
మొంగి

## ఇతరులు

☞ కేశవ, నారాయణ, మాధవ గోవిందులు, ఫాదరీ, తెల్లదొరలు, మాలీలు, పెండ్లవాడు మొదలైన స్వల్పపాత్రలు సందర్భోచితముగ వత్తురు.

---

# విషయసూచిక.

## తృతీయాంకము.



## చతుర్థాంకము.



## పంచమాంకము.



## షష్ఠాంకము

# తప్పొప్పుల పట్టిక



వరా:—ఇవి ముందే దిద్దుకొనుడు.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 4 | సాధనము | సాధమున |
| 3 | 21 | దేశదేవకుడు | దేశసేవకుడు |
| 5 | 2,3 | దైవాసురా ... ప్రపంచంబులుగ | వేర్వేరుగా నాయాలోకములుగా సురాసురులు భూమ్యాకాశముల్ మానవుల్. |
| 6 | 14 | ముద్దులముట్టమూట | ముద్దులమూట |
| 7 | 1,2 | రమణీ-నగలై | రమణీయంబయి చూడముచ్చట లెలర్పగ వృక్షజాలంబు. దేహము నెంతేని యలంకరించు నగలై |
| 8 | 13 | చుంచుము | చుంచును |
| 9 | 7 | పరప్రేమయు | పరబుద్ధియు |
| 10 | 22 | వృక్షస్నమూహంపు | వృక్షంబులగల్గు |
| 19 | 3 | పరునె | పనులె |
| 34 | 4 | సామర్థ | సామర్థ్య |
| " | " | సాద్యంబె | సాధ్యంబె |
| " | 19 | కొంచెయు | కొంచెము |
| 39 | 4 | భోగము | బోగము |
| 42 | 20 | స్త్రీలై | నీల్లై |
| 40 | 25 | తినుపోవ | తినుకుపోవ |
| 51 | 16 | వుంటారో | వుంటారు. |

| | | | |
|---|---|---|---|
| 58 | 8 | ఏకులంబుల | ఏకులంబున |
| 58 | 5 | పోరుచుండె ని | పోరుచుండె నీ |
| ,, | 10 | జనదే | జీనదే |
| 59 | 2 | దుర్జయములయందు | దుర్జయములందు |
| ,, | 12 | కిటువింత | కిటులింత |
| ,, | 15 | యిట్ల | నిట్లు |
| ,, | 19 | లిప్పుచు | లిప్పుడు |
| ,, | 21 | కొందుపు | కొందుప్పు |
| 60 | 7 | వలుకుచే | పలుకుచే |
| ,, | 16 | వఠనంబు | పఠనంబు |
| 62 | 3 | నిప్పట్లు | నిప్పట్లు |
| 62 | 6 | సిద్ధాంతిగా | సిద్ధాంతిగారట |
| 66 | 19 | పుల్క | పుల్కన |
| 67 | 2 | మనలోనె | మనలోననె |
| ,, | 10 | వాక్కుల్ | హాక్కుల్ |
| ,, | 13 | నోచుకో | నోచుకో |
| 69 | 2 | బావచూళ్ళ | బావలు |
| 77 | 4 | యికశూన్యం | యిలశూన్యం |
| 88 | 9 | వలను | వలయును |
| 89 | 14 | యిట్టలింక | యిట్లు, లింక |
| 93 | 3 | మము | మిము |
| ,, | 6 | అసలు | అసలె |
| 96 | 4 | చికగా | చిలగా |
| 111 | 2 | ముంతశేరు వేస్తే | ముంతశేస్తే |
| 117 | 26 | పెండ్లామును | పెండ్లామునుగా |



# ➳ సంస్కారిణి ⇜

అను

## సంఘ సమస్య.

### నాంది

---

చ॥ సకలమతంబులున్ సకలజాతులు సర్వకులంబు లేకమై
యొక యెడ సఖ్యతన్ దనరుచుండగ ముప్పదిమూడుకోట్ల సం
ఖ్యకు మించిమీరు సజ్జనులగల్గి పరస్పరవైరముల్ దలం
పక యొకటే కుటుంబముగ భారతసంఘము కీర్తిగాంచెడున్॥

(పుష్పాంజలియై దేశభక్తుడు ప్రవేశించుచున్నాడు)

ఆహా! సృష్టివైచిత్ర్యమెంత యగమ్యగోచరముగ నున్నది. అనంతకోటి జంతు సముదాయమునం దొకదానితో నొకదానికి సంబంధము లేకుండుటయు, మరల నొకదానితో నొకటి యెక్కువ సంబంధించియుండుటయు, వానిలో వానికి పరస్పరవైరానురాగములం గలిగియుండుటయు దలుచుకొనినపుడెల్ల నాకు భారతదేశస్థితియే జ్ఞప్తికి వచ్చుచుండును. ఆ పరమేశ్వరుని మహిమ యెట్టిదనిన,

సీ॥ ఏవస్తువును గన్న దైవతాంశ దగద
గద్ధాయమానమై గానుపించు
ఎందుజూచినగాని సృష్టిప్రపంచంబు
పరమేశు కీర్తనల్ బాడుచుండు

ఏపనియందైన నీశ్వరశక్తియే
దేదీప్యమానమై తేజరిల్లు
క్షణక్షణంబునకును సర్వేశ్వరునిదివ్య
మహిమావిశేషంబు మదిస్ఫురించు,
గీ॥ ఎట్టి నాస్తికునకునైన నెట్టి రాక్ష
సాధమునకైన తుదకవసానమందు
దోచకుండదనే జగదీశు గోచరంబు,
శంక లేటికి శ్రీహరి సర్వమపసి॥

ఇంకను ఆసర్వమయుని మహాత్మ్య మెట్టిదనిన, :—

సీ॥ అంబరవీధిలో యానంబుగాపించు
పక్షులెవ్వని కీర్తిఁ బాడుచుండు
రాత్రిలోఁగప్పయు నాతిగర్భములోని
బిడ్డ యెవ్వనిశక్తి బిల్లడించు
కంటికిగానరాకయె యెల్లెడలనుండు
సూక్ష్మజీవు లెవని సొంపుదెలుపు
చావు పుట్టుకలును సౌఖ్య మాపదలు నె
వ్వనిమాయ లన్నింటి బయలుపరచు
గీ॥ ఎవ్వడిప్పుడు నెప్పుడు నెల్లపుడును
ఇందునందున కెందేని నిముడియుండు,
నాదిమధ్యాంత రహితుడౌ నట్టివాని
మరువశక్యంబె యెంతటి నరునికైన !॥

సృష్టి ప్రపంచము వేరువేరుగా ననేక స్వరూపములుగలిగి యున్నను, అన్నిటియందునుగల పరమేశ్వర సంబంధమను చిహ్నము చే సృష్టి సర్వంబునకు నైక్యమేర్పడుచున్నది. అట్లే హిందూదేశమున గల వివిధజాతి, మత,వర్ణ,కులములన్ను, భారతీయతయును సంబంధమైక్యము చేయుచున్నది. హిందూమహమ్మదీయ, పార్శీ,క్రైస్తవ,జైన

యూధమతస్థులందరికిని, ఆ యా మతములందుగల యంతఃశాఖల వారి కందరికిని నైకమత్యమేర్పడి యెన్నడు సర్వసమత్వము లభించునో అప్పుడే మనజన్మ సార్థకమగును. ఐనను సృష్టియందు స్వాభావికముగ కొంత వైరభావమున్నట్లు తోచును.

ఉ॥ కప్పనుజూచి పాము నెలుకన్ గని పిల్లియు పిల్లిఁ గుక్క నె
ల్లప్పుడు జంపజూడవె? పరస్పర వైరములన్ మనుష్యులే
గొప్ప రణంబులన్ సలిపి కూలరె? మేటిబలాఢ్యులైన వా
రెప్పు డహంకృతిన్ బలవిహీనుల హీనత జూడరే భువిన్ ॥

అట్లే భారతదేశమునగూడ జాతి మతకుల వైషమ్యములు గొన్ని యుండవచ్చును. కాని భూలోక స్వర్గమనంబడు నీ యాసేతుహిమాచలపర్యంత, కృష్ణాగోదావరి, గంగాయమునాది మహానదీప్రాంతంబగు నార్యావర్త పుణ్యభూమియందు, సర్వప్రాణులును సమత్వమున సర్వదా సఖ్యత మెలంగుచుండినగదా సార్థకము. ఈ మహాధోరణిలో బడి, యీ రాత్రి ప్రదర్శింప సెలవుగైకొనిన నాటకసన్నాహములను గూర్చి బొత్తుగా మరచితిని. ఏమి నాటకమోయని మీ మనములం దాత్రిత జనింపవచ్చును. స్వరాజ్యసోపాన, గాంధిమహోదయ, గాంధివిజయ, పాంచాలపరాభవాది నవీన రాజకీయ నాటకముల రచించి మీ మనముల నిదివరకే యాకర్షించిన శ్రీ దామరాజు పుండరీకాక్షుడు గారిచే రచింపబడిన "సంస్కారిణి" అను భారతదేశ సాంఘిక సంబంధముగు నాటకము నీ రాత్రి ప్రదర్శింప ననుజ్ఞ గొంటిమి. అదుగో! నాటకసన్నాహములు ముగిసినవని జెప్పుటకై నామిత్రుడు దేశసేవకుడిటులనే వచ్చుచున్నాడు. మిత్రా, పాత్రములు సిద్ధమైనవా?

(ప్రవేశము దేశ. సేవకుడు)

దే. సే.—సర్వము సిద్ధమైనవి. జగన్నాటక సూత్రధారియగు నాది బ్రహ్మయే నాటకరంగమున ప్రవేశించి మరియొక సృష్టిగావింప నున్నప్పుడు యత్నముల కేమిలోటుండును. కాని యాజ్ఞ గైకొంటివా?



దే. భ—ఎవరియాజ్ఞ? గ్రంథకర్తగారి యాజ్ఞయా?

దే. సే.—కాదు కాదు. పాపమీరోజులలో గ్రంథకర్తలబాధ లేనేలేదు. కాని సర్వమునకు నెవరియాజ్ఞకు మనము లోబడియుంటిమో వారి యాజ్ఞ కావలెనుగదా!

దే. భ—సరి. సరి. తెలిసినది. ప్రభుత్వము వారి యాజ్ఞయా? ఇది సాంఘికనాటకమగుటచే వారియాజ్ఞతో మనకు నిమిత్తము లేక పోవచ్చును. పోవుదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)





# సంస్కారిణి

ప్రథమాంకము.

[1 వ. రంగము.]

[ప్రవేశము ఆదిబ్రహ్మ]

బ్ర— శా॥ నాయందున్న యఖండ తేజ మలప్రాణంబై మహాసృష్టియం
దాయా రూపములన్ ధరించు, నదె; బ్రహ్మాండంబు, దైవాసురా
ద్యాయా లోకములున్, ఋషీశ్వర మనుష్యప్రపంచంబులున్
వేయేలా, సకలంబు నామహిమచే విజృంభణంబయ్యెడిన్॥

నేనే మూలకారకుడను. నేనే ఆదిశక్తిని. నేనే సర్వమయుండను నాకొక రూపములేదు నాలోలేని రూపమునులేదు. నేనొకచోట నుండెడివాడను గాను. నేనుండని చోటునులేదు. నేనుతప్ప నాకు మరెవ్వరునులేరు. సర్వమును నాయందే యున్నది. నేనొక మహాశక్తిని. ఈమహాశక్తి ఆదిమధ్యాంత రహితము ఈమహాశక్తి యెచ్చట జూచినను విజృంభించును. ఈమహాశక్తి కనులకు కాన్పించునదికాదు. ఈమహాశక్తి కనుపించని చోటులేదు.

ఈమహాశక్తివలన ప్రయోజనమేమి? దీనివలనలేని ప్రయోజనమునులేదు. వినోదార్థమై నామహాశక్తికి నేనొకస్వరూపమును గలిగించెద. నాశక్తికి నేను ముక్కు చెవులు కనులు మున్నగు నవయవములు నేర్పరచెద. అదుగో నాశక్తికి తేజమునిచ్చితి. (సూర్యచంద్రులను సృష్టించును) వీరిరువురును సూర్యచంద్రులని పిలువబడుదురు

గాత. ఇదిగో భూమ్యాకాసంబుల సృష్టించితి. ఇదిగో సురాసురుల సృష్టించితిని. ఇదిగో ప్రపంచమునంతయు చరాచరంబులతో సృష్టించితి.

ఆహా, నేనెట్టి సౌందర్యమైన రూపములదాల్చితిని. వీరిలో నన్ను జగద్స్వరూపమెంతయు ముద్దుల మూట గట్టుచుండును. అస్మదీయ జగద్స్వరూపవ్యక్తి సౌందర్యము నించుక తిలకించుకొనెద. అమ్మా హేజగన్మాతా :—

( ప్రవేశము జగన్మాత )

గేయము.

పరాత్పరా శ్రీహరీ హరా మా వరాలతండ్రీ మాధవా,
సురాధిపతి కనికరానజగముల బిరాన బ్రోచెడు కేశవా,
ధరాధిపా మా మొరాలకింపగ పరాకు సేయని శ్రీధవా,
స్థిరంబుగను నీస్వరూపమే ఘనధరాతలంబగు భూధవా!

( తండ్రీ, సాష్టాంగనమస్కార ప్రణామంబు లాచరించుచున్నాను )

బ్ర—( చేరదీసికొని)

శా॥ పుత్రీ, ముద్దులమూట మూటగట్టునిను నాపుణ్యంబునన్ గాంచితిన్
నేత్రానందముగల్గె నాకు, తరియించెన్ నాదు జన్మం బహో
రాత్రంబుల్ నిను జూచుకొంచు ప్రియమారన్ మెంచి రక్షింతు సు
ధాత్రి దేవిరో, నాస్వరూపము జగత్ప్రఖ్యాతి గావింపవే!

జగ—తండ్రీ, భవదీయ దివ్యాంశచే నన్నొక కాత్కాలికస్వరూపము ముగ సృష్టించితి వేగాని, నాకొక ప్రత్యేక సౌందర్యమేల్ల దిది?

బ్ర—బిడ్డా, నీకాశంక యక్కరలేదు. నీ వీ జగత్తురూపమున సర్వదా వెలుంగుచుండువు. నీ కిప్పుడొక ప్రత్యేకరూపముగూడ వచ్చు నది.

మ॥ రమణీయంబయి చూడసుందరముగా రాజిల్లు వృక్షస్సమూ
హము దేహంబు నలంకరించు నగలై యాకాశముల్ భూమిసాం
ద్రములన్ నింపిన జీవరాశి కడుసౌందర్యంపుటంగంబులై
యమరెన్ ముద్దులమూట నీవు మనుమమ్మా శ్రీజగన్మాతరో॥

జగ—తండ్రీ, నాయందేమి ప్రజ్ఞలుగలవని నేనీసృష్టిప్రపంచమునం తయు నెత్తిపై కెత్తుకొని భరింతును. హాయిగ భవత్పాదార వింద సేవానిమగ్నురాలనై తమసన్నిధి నిలచెద

బ్ర—పుత్రీ, నీ కాభయమక్కరలేదు. సర్వదా 'నారువోసిన దేవుడు నీరు పోయడా' యని యధేచ్ఛనుండుము. అట్లని నీయం దేమియు భారములేదని తలంచవద్దు. సృష్టిప్రపంచమంతయు నాచే నిర్మింపబడిన కాలచక్రముపై దిరుగుచుండును. కాని సృష్టియందు ప్రతిప్రాణియందును నేనంతరాత్మరూపమున వెలయుచుందును. ఆప్రాణికోటి తమతమ యంతరాత్మలననుస రించి తమ విధ్యుక్తమును నెరవేర్చుచుండవలయును. వారి వారి పూర్వచర్యలవలన వారివారి కర్మయేర్పడుచుండును. ఆ కర్మపై నాధారపడి ప్రపంచమంతయు సాగుచుండను. ఈ రహస్యమంతయు నీవే క్రమముగా దెలిసికొనగలవు. ప్రస్తుత మీవిషయముల మాత్రమెరింగి, నీవింక నీసంతానము దెస కేగుము.

జగ—జనకా,

శా॥ నాసంతాన మనంతకోటిగద! నేనా, వ్యర్థురాలన్ గదా
కాసంతేనియుఁ జేతగాదుగద, లోకంబెల్ల సైరింపగా
నోసర్వేశ్వర, నావశంబగునె? నీవున్నాడవన్ ధైర్యమే
నాసాయంబయి నన్ను బ్రోవనియెడన్ నారాత యెట్లుండునో॥

కావున, తండ్రీ నాకట్టి యభయంబొసగుము॥

బ్ర—బిడ్డా, నీ విట్లధైర్యపడకుండ నీకొక్క రహస్యమెరిగించెద,

క॥ నీయందు నితరులందును
నాయందు సమస్తమందు నారాయణుడే
హాయిగ ధర్మముగాచుచు
బాయక నెల్లప్పుడును భయపడ నేలా॥

మరియు నింకొక రహస్యముగలదు.

తే॥ గీ॥ నీదుసంతానమందు మాణిక్యమట్లు
వెలయుచుండును నరజాతి, వేడ్కవారు
తోటి జీవరాశిని ప్రేమతోడ గనుచు
నీకు సంతోషమిడుదురో, లోకమాత॥

వారికి, తమ తోటిప్రాణులకన్న నెక్కు డవకాశముల గలవు. కావున వారి సంరక్షణను వారు జూచుకొనుచు తమ సోద ప్రపంచమునుగూడ రక్షించుట వారి విధ్యుక్తధర్మమైయున్నది. వా వలన నీకుసుఖము చేకూరుచుండును.

జగ—తండ్రీ, ఉత్తమజాతియం దుద్భవించినను నరజాతి సర్వదా సదు శములగలిగి వర్తింతురాయని నాకు శంకబొడముచున్నది.

బ్ర—అవును, నీసందియము సమంజసమైనదియే. నరజాతి యొకాన కప్పటికి ముఖ్యముగా కలియుగము గడచినకొలందిని, ధర్మము నకు విరుద్ధముగా నహంభావత్వమున మెలంగుటయు సంభవించ వచ్చును. పాపము పెరుగుచు విరుగుచు ప్రపంచమున నూగు లాడుచుండును. అదిలేనిది జగన్నాటకము సాగనేరదు. నర లజ్ఞానతిమిరంబునబడి మరల కోలుకొనుచు నొకప్పటికి నన్ను జేరుచుందురు. పాపము మరీ విపరీతమగునపుడెల్ల నేనేదోయొ రూపమున భువి నుద్భవించి ధర్మమును పునరోద్ధారణసేయు చుందును. ప్రస్తుతము నీకు కొన్ని దివ్యమంత్రముల ను దేశించెదను. నీనరసంతతిలో నుత్తములగువారికివి ప్రసా

పుము. వారివలన నందరికీ వ్యాపించును. ఈధర్మసూత్రము లీ ప్రపంచమున దైవత్వము నెల్లప్పుడు నిలిపియుంచును. ఆ సూత్రము లెవ్వియనిన,

క॥ నిరతము హరిధ్యానించుట
సరసమతియు న్యాయ సత్య శౌచగుణంబుల్
కరుణయు సర్వసమత్వము
పరప్రేమయు హింసలేమి పరమ హితంబుల్।

ఈయీ హితంబుల ననుసరించి మదమాత్సర్య కామక్రోధముల త్యజించి స్త్రీవిలోలత్వ మద్యపానాది దురభ్యాసంబులం జిక్కక సర్వదా ధర్మమార్గము ననుసరించి నిత్యకర్మలు నెరవేర్చువా రుత్తమపురుషులై నాసాన్నిధ్య ఫలంబున కర్హులగుదురు నీవింక నిశ్చింతగా నీ సంతానముమధ్య సంతసించుచుండుము.

(అంతర్ధానమగును)

(తెరపడును)

---

## 2 రంగము (నరప్రపంచము)

---

(ప్రవేశము: ఆదినరులు. కేశవుడు, నారాయణుడు, మాధవుడు, గోవిందుడు వ॥.)

కీర్తన.

[ భజనచేసే విధము తెలియండి మోస్తరు ]

జననిపాదములాశ్రయించండీ, జనులార మీరు। మననుగన్న భూమిగొలువండీ॥ జ॥

1 ఘనజగంబే గర్భమందున। మనుచునుండెదు లోకమాతను మనమునం దెడబాయకెప్పుడు। వినయభక్తులతో భజింపుడు॥ జ॥

2

తారంబుల్, గగనంబునందెసగు సౌందర్యంపు సంతాన మిం
పారగ భూమిజరించు జంతు సముదాయంబుల వినోదంబులై!

మరియు,—

క॥ ఒకవృక్షము నొకవృక్షము
నొకపక్షియు నొక్కపక్షి యుర్వి సమస్తం
బొకదాని నొకటి బోలక
సకలవిధంబులను మాఱ్ఱు జగమున దోచుల!

ఆహా! యేమి యీభూమిపై బారులదీర్చి పారకాడు చిత్ర
చిత్రకీటకంబుల సౌందర్యము! ఆహా! యేమి యీఘోరారణ్యంబున
నేత్రోత్సవముగావించు వింతవింత ఫలపుష్పలతాసయిత వృక్షజాలం
బునల విహగాడు జంతుసంతానము! ఆహా! కన్నుల మిఱిమిట్లుగొలు
పుచు నాకసమ్మునంటిన యీ పర్వతరాజములనుండి మధురగానము
సేయుచు భూమిపై దుమికి చివ్వచివ్వున పరువులెత్తు నీనిర్మలోదక
ప్రవాహములసౌందర్యమేమి? ఆహా! నేత్రోత్సవము-నేత్రోత్సవము-
నేత్రోత్సవము.

(ఉలికిపడి) అయ్యో! దైవమా, రమ్ము-రమ్ము-నాముద్దుజంతు
వులు నీటంబడి నశించుచున్నవి! అక్కటా! యీనూత్నజీవులు తీవ్ర
వాయువులచే గొట్టుకొనిపోవుచున్నవి! కటకటా! యేమి యీఘో
రము! ఈజంతువులు తమలోతాము పోరాడి కూలుచున్నవి! హరి
హరీ! అదుగో, అదుగో. పారకాడుచున్న యీపురుగులను పక్షులు
తన్నుకుపోవుచున్నవి! కటకటా! యీవిపరీతములను జూచి నేను
భరింపజాలను!

సీ॥ ఈ చిన్నిపురుగుల కేహానిలేకుండ
నేనెట్లు గాపాడుదాన నొకొ
అకట! యీ నోరులేనట్టి జంతుసమూహ
మేరీతి గాతు నే నేమి సేతు

ఈ సుందరంబైన వృక్షజాలమునకే
కీడురాకుండ గాపాడుటెట్లు
అజ్ఞానతిమిరంబునం దోలలాడు నీ
ప్రాణులకెట్లు పుణ్యము లభించు॥
ఈవిషాద పరిస్థితులెట్లు సైతు
నెవరికై యేడ్తు నాచేత నేమియగును
యేదియెట్లనో నాకేమి యెరుకపడును
దైవమా! నీ మహామాయ తరమెదెలియ॥

అదుగో నా నరసంతాన మిటువచ్చుచున్నది. వీరిస్థితి యెట్లుం డునోగదా!

[ ప్రవేశము (నరులు కేశవుడు, నారాయణుడు, మాధవుడు, గోవిందుడు) ]

— కీర్తన —

దండాలమ్మోతల్లి జగన్మాత
నీయుండా మమ్ముండనీయె లోకమాత
నీగర్భమందు బుట్టినామె లోకమాత
మాకు నిర్భయమొగలిగించె జగన్మాత
ఏల్లోడ్ని దలుచుకుంటూ లోకమాత
నీ శ్లాకొముల్కుతామె జగన్మాత
మాపాణా ల్నీకిత్తామె లోకమాతా,
మమ్ముపాలించి యేలుకోవె జగన్మాతా॥
అని సాష్టాంగప్రణామము లాచరింతురు.

జగ—నారాయణుని మీరు నరులారా
ఆరాధించండయ్యా నరులారా,

నరు—నీవేనారాయణుడవు జగన్మాత
నీవే మమ్మేలుతల్లివి లోకమాత॥
జగ—పరమేశ్వరుని మీరు నరులారా,
మరువకదలచండి నరులారా॥
నరు—పరమేశ్వరుడ వీవె జగన్మాతా
మరచిపోలేమంటు లోకమాతా?॥
జగ—ఒక్కడే దేవుండు నరులారా,
యెక్కడైనా యుంటాడు నరులారా,॥
నరు—ఎక్కడైన నీవేను లోకమాతా
మొక్కెదము రక్షించు జగన్మాతా॥

జగ—బిడ్డలారా, పరమేశ్వరుడే మిమ్ములగాచువాడు. నేనూరక నిమిత్తమాత్రముదాననే. ఆపరమేశ్వరుడు సృష్టిప్రపంచమునవెల్ల మీయందెక్కుడు భారముంచెను. మీ చుట్టుప్రక్కలనుండు ననంతకోటి జీవరాసిని గాపాడుచు, మిమ్ము మీరు గాపాడుకొనుభాధ్యత మీయందున్నది.

కేశ—అమ్మా మాకేం సెప్పాలాప్రా సెప్పు. మేమిప్పుడు సేసాస్తాం. మాప్రాణాలుంటే నీపాదాలసాక్షి యేంలోటులేదు.

ఇతరనరులు—ఓ-మేమంతా సిద్ధం, సిద్ధం.

జగ—తనయులారా, నాకేమికావలయును! మీరందరు క్షేమముగానుండుటయే నాకుకావలసినది. మీలో మీరైకమత్యముగలిగి తలా యొకపనిని నెరవేర్చుకొనుచు నిరంతర పరమేశ్వరధ్యానతత్పరులై భూతదయాస్వభావులై ధర్మమార్గావలంబకులై సత్యప్రియులై యహింసాస్వరూపులై నిత్యకర్మానుష్ఠానపరాయణులై సదా వర్తించుటయే నాకు పరమసంతోషము. అట్లు ధర్మసత్వగుణములు గలిగి, ప్రపంచసేవయందు నిమగ్నులై స్వార్థపరులుగాక వర్తించువారికే బ్రహ్మత్వము

సిద్ధించును. అనగా వారు పరమేశ్వరునికి సర్వదా సాన్నిహిత్యమున నుందురు.

న— తల్లీ, మాలో మాకేమియు భేదాలు లేవు. మేమందరము తలా యొకపని చేసుకొనుచున్నాము. కాస్త కష్టపడితే మాయందరికి కావలసినంత తిండి నీయనుగ్రహంవల్ల సిద్ధిస్తుంది.

జగ— బిడ్డలారా, సంతసించితిని. కడకు నేను జెప్పవలసిన విషయము లేవి యనిన,

సీ॥ నరులార, మీరెల్ల హరిభక్తి నేవేళ
మరువకుండుటయె ధర్మంబు మొదట
జనులార, మీరహింసా దీక్ష నెపుడు స
ద్భక్తిఁ గైకొనుటె విధ్యుక్తమెపుడు
బిడ్డలారా, మీరు ప్రియమార నైకమ
త్యముగల్గి వర్తించు టాసరంబు
మనుజులారా, యెప్పుడును న్యాయసత్యాది
సద్గుణంబుల వీడి జనగవలదు

గీ॥ అవని లౌకిక సంబంధమందు మునిగి
యిహసుఖంబులకే తపియించవలదు,
పారమార్థిక చింతన బాసియెపుడు
మెలగ వలదయ్య నా ముద్దు బిడ్డలార॥

అందరు— తల్లీ నీయనుజ్ఞలన్నియు శిరసావహించితిమి.

జగ— తనయులారా సంతసించితిని మాకింక నమంగళ మప్రతిహతము బగుగాక! పరమేశ్వరుడు మీకు సర్వదా శుభములొసగుగాక! ధర్మము వర్ధిల్లుగాక! మీకు జయముచేకూరుగాత! నేనిక పోవ వచ్చెద. (నిష్క్రమించును)

కే— ఒరే మనభూదేవితల్లి చెప్పినప్రకారం మనమంతా తలాయొక పనిచేసుకొని చక్కగానుందాము. నాకు పరమేశ్వర రహస్యమును కనుగొనవలయునని బుద్ధిపోవుచున్నది. మనను సృష్టించిన ఆ ఆదిబ్రహ్మమహాత్మ్యమును దెలిసికొనవలయును.

నా— నాకు ప్రపంచమునందు బాధింపబడువారిని గాపాడి దుర్మార్గము నడంచుచునిమీద నుండవలెనని కోరికగానున్నది.

మూ— మనికందరికి కావలసిపనులన్ని చేయుచు ప్రాణికోటిని కాపాడవలెనని నాకు కోరికగానున్నది.

గో— నేను భూదేవి కరుణాకటాక్షమును సంపాదించి, మనకందరికి యాహారము నార్జించిమీకు నొప్పడవలెనని యున్నది.

కే— సోదరులారా, మననలుగురికి ముఖ్యమైన యన్నిధర్మములపైనను బుద్ధిపోయినది. కావున మనబుద్ధి ననుసరించిన మనమన ధర్మంబుల యథావిధిగా నెరవేర్చుకొనుచు సుఖముగా నుందము రండు. కాని మనమందరముగూడ భగవంతుని ధ్యానమును మరువక, పాపమున కెడమీయక ప్రవర్తింపవలయును. పోవుదము రండు. (నిష్క్రమింతురు)






## ద్వితీయాంకము.

(1వ రంగము.) (కలియుగప్రారంభము)

(ప్రవేశము - కేశవశాస్త్రి)

కేశ — ఆహా! కాలమెంతలో మార్పు జెందుచున్నది! ఆది బ్రహ్మ ప్రపంచ మంతయు సృష్టింపబడి, క్రమ క్రమాభివృద్ధిని గ చుచుండ, అత్యద్భుతమగు పూర్వచారిత్రను శాశ్వతము జే చు, యుగయుగంబులనుగూడ చివ్వు చివ్వున దాటి కాలమె రివ్వున పరుగెత్తుచున్నది! అప్పుడే మొదటి మూడుయుగ లును గడచి నాలవయుగ మారంభమగుచున్నది.

సీ॥ నారసింహా ద్యవతారంబులను గాంచి
కృతయుగంబటు పవిత్రతవహించె
శ్రీరామచంద్రుని జన్మ జేయుట చేసి
త్రేతాయుగంబట్లు పూతమయ్యె
శ్రీ కృష్ణమూర్తి విజృంభించుటను జేసి
ద్వాపర యుగమట్లు ధన్యమయ్యె
నాలవయుగమందు నాధుడై కలిరాజు
చెలరేగ కలియుగంబిల జనించె
గీ॥ ఇంక సకలదుర్మార్గము లంకురించి
పాప మభివృద్ధిగాగ ప్రబలచమెల్ల

క్రిందు మీాదానటంచును పిందు మకట !
మరల కల్క్యవతారంబు నరయునెపుడొ!

భూలోకస్వర్గంబనంబడు యాసేతు హిమవన్నగ పాంతమగు నీ భారతపుణ్యక్షేత్రమున ననర్థకములు వాటిల్లకుండుటకై సకల మతాచార, వర్ణాశ్రమధర్మంబులను యథావిధిగా నెరవేర్చుచుండవల యును. అందు భూసురులైన బ్రాహ్మణోత్తములు తమతపోమహిమచే కలిరాజపాలంబడకున్నచో నంత భయము లేదు. కలిరాజు దుర్ణయం బులకు జ్ఞానవంతులగువారు వలలలో బడకుండ నుండవచ్చు నని మున్ను అభిమన్యునందనుండగు పరీక్షన్నరేంద్రుండు శపించె. ఆహా! జ్ఞానభాగ్యులగు బ్రాహ్మణ వంశం బెట్టి పవిత్రవంతము.

సీ॥ స్నాన సంధ్యాద్యనుష్ఠానంబులను జేసి
అరుణోదయమునకే పోయిగాంచి
పంచాంగమును చేతబట్టి యింటింటికి
మంచి చెడ్డలు దెల్ప బయలుదేరి
జనులెల్ల భక్తితో చారెడేసియొసంగు
గింజెలన్నిటి జేర్చి గృహము జేగి
దైవతార్పన జేసి సావకాశంబుగా
పన్నపానాదుల నారగించి
గీ॥ లేచి, వేదాధ్యయనమింత యాచరించి
యేపురాణమొ, పదిమందికెరుకపరచి
చీకుచింతలు లేకుండ స్వేచ్ఛతోడ,
బ్రతుకు బ్రాహ్మణునకు సాటిమనుజుడెవడు ?

అట్టివారికింక ప్రపంచసంబంధమే యనావసరము. కాని యొక్క విషయముమట్టుకు మమ్ము బాధించు చున్నది. అది యెద్దియనిన,—

సీ॥ నిదుర లేచినదాది నిముసమైనను తీర
కయె రైతులెల్లరు కష్టపడఁగ,
వినుఁడు విశ్రామంబు లిసుమంత లేకయే
వ్యాపారమునను వైశ్యులుండ
బాహుబలమును గాచి కులధర్మమును నిల్ప
క్షత్రియులెల్లప్డు శ్రమపడంగ
జనులెల్ల వారివారి నియమితంబైన
పనులలో మున్గులై బ్రతుకుచుండ

గీ॥ దైవమునుగంటి రాక్షసత్వంబు జగతి
ప్రబలనీకుండఁగా పాశ బ్రాహ్మణులకు
విధియనంగను పుడమిలో విప్రకులము
వెలసెననితోచు నది నెరవేర్చుటెట్లొ!

మాకు ప్రపంచములో నీసంబంధము మాత్రమే గలదు. మేము నెరవేర్పవలసిన మహాధర్మమున కనుకూలముగ ప్రపంచమంతయు మాపై నమితభక్తి గలిగియుండును

మ॥ జనులెల్లన్ మము దైవతుల్యులను విశ్వాసంబునన్ జూచి, మా
కు నమస్కారము లాచరించుచు ప్రియోక్తుల్ మాదెసన్ బల్కు మం
చిని చెడ్డన్ మము గోరి గన్గొనుచు నాశీర్వాదముల్ బొందుచున్
వినయంబొప్ప మెలంగుచుందురు సదా వేయేల మా సేవలో॥

అట్టితరి మాయందెంతయో భారముండుననుటకు సందియము లేదు. మాపై వారికిగల భక్తిని నిలుపుకొనుటకు మాయర్హతను మేము కాపాడుకొనవలయు. అట్లొనర్చుటకు—

తే॥గీ॥ స్వార్థమను మాట మరచిపోవలయు మొదట
సర్వజీవుల సమదృష్టి సాకవలయు
హింసయను మాటెయెపుడు సహించరాదు
ప్రాణికోటిని సేవింపవలయు నెపుడు॥

మరియు—

తే॥ గీ॥ స్నానసంధ్యాగ్ని హోత్రాది సకల కర్మ
లుచితరీతిస గావించు చుండవలయు
వేయు యేటికి మేను గావించుపను లె
యుర్వికెల్ల నాదర్శమై యుండవలయు॥

ఇట్లు షర్తింతుమేని జగమంతయు బ్రాహ్మణులపై భక్తివిశ్వాసములు గల్గిధర్మమార్గమున నడుచుచుండును. ఓహో పురాణకాలక్షేప సమయమైనది. అదిగో జనులందరు వచ్చుచున్నట్లున్నారు.

(అనుచు. దర్భాసనముపై కూర్చొని పురాణగ్రంథమును చేకొనును)

(ప్రవేశము: నారాయణవర్మ, మాధవగుప్త, గోవిందదాసు వా॥)

(అందరు సాష్టాంగ నమస్కారము లాచరించి కూర్చుందురు.)

కే— సోదరులారా, యీరోజు మన వారందరికి క్షేమమేగదా.

నా— క్షేమమేగాని నేడొక్క విశేషము జరిగినది.

కే— ఏమది! ఎవరికిని ప్రాణహాని లేదుగదా!

నా— లేదు: కాని యొకచోట నొకడొక జంతువును జంపుచుండెను. నేనదిజూచి యాజంతువును గాపాడుటకై యాతనికడకురికి వారింపగా, వాత డూరుకొనక తిరుగబడెను. అది యేమని యడుగ "స్వభావములోనొకజంతువు నొకజంతువును తినుటలేదా కావున నేనుమాత్రి మీజంతువు నేల భక్షింపరాదు?" అని జవాబు చెప్పి మరల జంతువు వెంటబడెను. నేనతని వధించి జంతువును గావదలచితినిగాని వా మనంబొప్పక యిమ్ముడుగుదమని తలంచితిని ఇంతలో నాజంతువు పారిపోయెను.

కే— శివశివా! ఎట్టిఘోరము? ఆతనిని నీవు వధింపకుండుట

మంచిదేగాని యీకిరాతకుని మనలోచేరనీయవద్దు. పరమేశ్వరుడే యతనిని శిక్షించును.

గో— అయ్యా, పరమేశ్వరుడు శిక్షించుననుట తోడనే నాకొక సందియము తోచుచున్నది. అదియెద్దియనిన,

క॥ 'హరి హరి' యని యెల్లప్పుడు
మఱువవు పరమేశు నీవు మాగతి యేమో
హరిపదముల సేవింపగ
నరవిమానము తీర దాత జాగ్రహపడదే!!

మా— భేష్ నేనును అవిషయమే యడుగదలచుచుంటిని

శే— మంచిప్రశ్న నడిగితిరి. నేనీరోజు పురాణములో వర్ణాశ్రమ ధర్మములను గూర్చి చదువనెంచితిని. అందు మనుష్యులేయే పనులు చేయువారైనను వారివారి యనుకూలవిధముల పరాత్పరుని సేవించినయెడల వారికి మోక్షము లభించునని చెప్పబడి యున్నది. మనవారందరమేయేధర్మముల నిర్వహింపవలయునో అధర్మముల నాచరించిన మనకు మోక్షము లభించును. అధర్మములిందు నిరూపింపబడినవి.

నా— అట్లయిన తక్షణము మొదలుపెట్టుడు.

శే— ఇదిగో ప్రారంభించుచున్నను:—

(పురాణము తెరచి చదువును.)

":—నారదుండు ధర్మరాజునకు వర్ణాశ్రమధర్మంబులు దెలుపుట:—

... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

క॥ దమమును శౌచము దపమును
శమమును మార్దవమును కృపయు

క్షమయును హరిభక్తియు హ
ర్షము నిజలక్షణము లగ్రజాతికినధిపా!

ఉ॥ శౌర్యము దాన శీలము బ్రసాదము నాత్మజయంబు తేజముం
ధైర్యము దేవభక్తియును ధర్మము నర్థముగామము న్బుధా
చార్య ముకుందసేవలును సత్కృతియుం బరితోషణంబు నౌ
దార్యము రక్షణంబుఁ బృథివీవరశేఖర, రాజచిహ్నముల్!

క॥ ధర్మార్థకామ వాంఛయు,
నిర్మల గురుదేవవిప్ర నివహార్చనముల్
నిర్మదభావము బ్రమదము
శర్మకరత్వమును వైశ్య జనలక్షణముల్!

ఉ॥ స్తేయము లేని వృత్తియు శుచిత్వము సన్నుతియుం ద్విజేశులన్
మాయలు లేక డాయుటయు మంత్రము సెప్పక పంచయజ్ఞముల్
సేయుటయుం ధరామరులసేవయు గోవుల రక్షణంబు న
న్యాయము లేమియుం మనుజనాథ, యెఱుంగుము శూద్రధర్మముల్

మరియు బ్రతివ్రతా లక్షణంబు లెట్టివనిన—

సీ॥ శీలము పాటించి నిర్మల దేహయై
శృంగార మేప్రొద్దు చేయవలయు
సత్యప్రియాలాప చతురయై ప్రాణేశు
చిత్తంబు ప్రేమ రంజింపవలయు
దాక్షిణ్య సంతోష ధర్మమేధాదుల
దైవతమని ప్రియుఁ దలఁపవలయు
నాథుఁడేపద్ధతి నడచు నాపద్ధతి
నడచి తద్బంధుల నడపవలయు

ఆ॥ వె॥ మార్దవమున బతికి మజ్జనభోజన
శయన పాన రతులు జరపవలయు

విభుడు పతితుడైన నెలదిపాతివ్రత్య
మహిమచేఁ బుణ్యు జేసి మనుపవలయు॥

క॥ తరుణి తనప్రాణవల్లభు
హరి భావముగా భజించి యతడును దానున్
సిరికైవడి వర్తించును
హరి లోకమునందు సంతతానందమునన్

క॥ ఉపవాసంబులు వ్రతములు
దపములు వేయేల భర్తదైవతమని ని
ష్కాపటత గొల్చిన సాధ్వికి
నృపవర, దుర్లభము లేదు నిఖలజగములన్

మరియు సంకరజాతులయిన రజక చర్మకారక నటబురుడ
వర్తక మేద భిల్లురగు నంత్యజాతు లేడ్వురకును జండాల పుల్కస మా
తంగజాతులకును నాయాకులాగతంబులయిన వృత్తులఁజౌర్యహింసాదు
లు వర్జించి సంచరింపవలయు.......................... సత్వ స్వభా
వంబుతోడ నెవ్వాడు దప్పక నిజ వంశాచారవిహితధర్మంబున వర్తించు
నరుండు మెల్లన స్వాభావిక కర్మపరత్వంబువిడిచి ముక్తి నొందును
జాతిమాత్రంబునఁ బురుషునికి వర్ణంబు నిర్దేశింపంబని లేదు. శమ
దమాది వర్ణలక్షణవ్యవహారంబుల గనవలయు ...............

(ప్రవేశము: పంచముడు చచ్చినగొడ్డు నీచ్చుకొనుచు
రక్తహస్తములతో)

మా—అరెరరె-ఇదేమిటిదేమిటి!

నా—ఈతడే యీతడే, నేను కలిసికొనినది-ఇతడ్డె-ఇతడే.

కే—రామ-రామ-రామ-ఛీ, అవతలకు పో- (అని లేచి మూరము
జరుపోవగా తక్కిన ముగ్గురునుగూడ లేచిపోదురు.) నీవు మా

సమీపమునకు రావలదు. నీవు గడునీచమైన పనిచేయుచున్నావు! దూరముగా నుండుము!

నిమ్న చండాల మతంగజాతులందుగూడ చౌర్యహింసలు నిషేధింపబడినవి. నీవు బహిరంగముగా హింసజేయుచున్నావు. కావున నీవు మాలలుగురిలోనను చేరక పంచముడవై మాకు దూరమున నూరివెలుపలనుండుము. నీకృత్యములు మేము సహింపజాలము.

అందరు— ఛీ! పొమ్ము పొమ్ము.

పం— దీనిని నేను సంపలా- సచ్చినదాన్ని యీడ్చుకుపోతుండా- ఇదాడ పడుంటేను కుక్కలు పీక్కుతింటువున్నాయి-నేను చూచి మాయింటికీడ్చుకుపోతుండా!

కే— నీ వీ దారినగాక ఊరివెలుపలిగుండా పొమ్ము. ఇంటికేల గొని పోవుచున్నావు?

పం— కోసి తింటానికి.

కే— శివ-శివా-ఛీ పాపాత్ముడా!

తే॥ గీ॥ ప్రాణిహింసయె కడు ఘోరపాతకంబు,
అందు మాంసభక్షణ మధమాధమంబు,
నీవు రెంటినిగావించినావు నీచ,
ఛీ! యిటులరాకు, మామధ్య జేరదగదు॥

పం— మీకు దంణంయెడతాగాని నేనొకటడుగుతా సెప్పండి

ఆ॥ వె॥ పిల్లి యెలుకబట్టి పీల్చి నత్తురుదాగు,
బల్లి పురుగులెన్నొ బట్టి మ్రింగు,
అడవిలోన సూడ నకురిమితంబుగా
నొకటినొకటి సంపుసుంటు నేల?॥

కో— ముందు నీవు దూరముగా నున్నచో చెప్పెదను

(పం. దూరమునకు పోవును)

వినుము—

మ॥ నరజన్మంబు సమస్త జన్మములలో నాణెంబుగాఁగఁ పరా
త్పరుఁడే సృష్టియొనర్చె, మానవుల మేధాశక్తియుఁ జ్ఞానముఁ
గరుణాదృష్టియు నుంటగల్పి యిటు లజ్ఞానాంధకారంబునన్
వరులుఁ మూఢమృగంబు లొక్కటని యెంచఁ సిగ్గులేదేలరా॥

అందరు— ఛా, ఛా, అవతలికి పొమ్ము; పొమ్ము.

(అని వెళ్ళ గొట్టుదురు)

1—మనమీతని నిట్లు బహిష్కరించుటవలన యితనెక్కటికైన
జ్ఞానము సంపాదింపక పోడు. నేను మనమింక పురాణకాలక్షేప
ము నాపి యెవరిపనులపై వారము పోవుదము.

నా—ఈపంచముని మనలో నింక చేరనీయగూడదని నిశ్చయించు
కొంటిమి

మా—మరల బుద్ధివచ్చువరకు మనదగ్గరికి రానీయవద్దు

గో—అసలు రానీయవద్దు. ఈవేళ కింక పోవుదము (కేశవునకు
నమస్కరించి అందరు నిష్క్రమింతురు)

2. వ రంగము.

దర్బార్

కలిమహారాజు.

(మంత్రులు— దైవదూష్యకు- హింసరాజు అధర్మవక్త్ర
అసత్యమూర్తి వగయిరా)

దైవ— హే! డాంబికాడంబరాదంభక పరీక్షాధురీణా, హే నిరు
పమాన నిరుపయోగ నిరసన విరస దురంధరా, సకలదుర్మా

దురదృష్ట దుర్బుద్ధి దుష్టచక్రవర్తీ, సర్వనీచాతినీచ ఛండాల శేషజమహారాజాధిరాజా, హే కలిమహారాజా జయము. జయము. ఏదీ భవదీయ ప్రభావాసక్త్యాదు లించుక సేవకుల వీనులవిందుగా వినిపింపుము!

ఇతరులు:— అవశ్యమవశ్యమెమో మహాసూరి రాజాగ్రగణ్యా.

క— హే, మంత్రివరులారా, భవదీయ భక్తివిశ్వాసములకెంతయు సంతసించితిమి. వినుడు:—

మదీయనిర్మితస్థానంబులు ప్రాణివధ స్త్రీద్యూతపానంబులును, మరియు సువర్ణమూలంబగు నసత్య మద హింసా వైరంబులను పంచప్రదేశములును అయియున్నవి. తదానుసారంబుగానే జేయు మహాకార్యము లాలకించుడు.

సీ॥ అగ్రజాతికి నేనహంకారమును నేర్పి
స్వార్థమతుల జేయ పాటుపడుదు.
క్షత్రియులకు రాజసౌఖ్యముల్ రుచిచూపి
ధర్మముల్ మరపించుదారి జూతు
వైశ్యులందరిని దుర్వ్యాపారములనుంచి
ధనలక్ష్మికూడిగంబును కుదుర్తు
శూద్రజాతికి పెక్కు క్షుద్రబుద్ధులు నేర్పి
భక్తివిశ్వాసముల్ పాడుసేతు

గీ॥ మతములను భ్రష్టమొనరించి మంటగలిపి
దైవనిర్మాణమెల్లను తారుమారు
చేసి సద్భావమెందు నశింప జేతు
కలిమహారాజు నాపేరు గాముకొనుడు.

ఇంకను:—

శా॥ దైవబ్రాహ్మణ గో మహాఋషి మహాత్మ్యంబెల్ల క్షీణింపగా
భావ్రాదేశము నీచబుద్ధులు దురభ్యాసంబులున్ తీవ్రతో

హావేశంబు కుయుక్తి బానిసతనం బల్పాయువున్ హింసయున్
యావద్భూమి నలంకరింపగను రాజ్యంబేను పాలించెదన్ ।

మరియు మంత్రులారా, మీకర్తవ్య మేమి యనిన,—

సీ॥ ఒకజాతిపైన నింకొకజాతి నెక్కించి
వేడుకతోడ మీ రాడుకొనుడు,
ఒకరిపై నొకరి కన్యోన్య వైషమ్యముల్
గలిపించి చోద్యంబు గాంచుకొనుడు,
కులభేదములు వర్ణములభేదములు బైలు
దేరగా ముచ్చట్లు దీర్చుకొనుడు,
ఘోరయుద్ధంబులఁ గ్రూరాయుధములతో
సాము సేయుచు సంతసంబుగనుడు,
గీ॥ అంతశముల పైవారిని క్రిందఁద్రోసి
క్రిందివారి నంతశము లెక్కించుడెపుడు,
ధర్మరాజ్యంబునకు మారధర్మరాజ్య
మెందుస్థాపించి హర్షంబునొందుడెపుడు ॥

మం—శేవ్-ఫరాక్-కలిమహా రాజా-ఫరాక్-ఫరాక్.

మరియు,—

సీ॥ జారచోరత్వముల్ మేరలేకధరిత్రి
సాగింపవలయు మీశక్తికొలది
ప్రాణిహింస జగాన ప్రాబల్యమై, మాంస
భక్షణమొకటి విల్పంగవలయు
స్వాతంత్ర్యమనుగంటి సాంప్రదాయములెల్ల
గోల్పోయి మనుజులు కుందవలయు
సకల మతాచారసారంబు జచ్చి, మూ
ఢాచారమొక టూగు లాడవలయు

గీ॥ స్త్రీవిలోలత్వమవని విశేషమగుచు
మోహపాశంబుల జగంబు మునుగవలయు
వింతవింత వ్యాధులను గల్పించుచుండి
జనుల క్షాయు వెప్పుడొ నంగ వలయు॥
(భేష్ ఫరాక్ కలిమహారాజా)

ఈయాకార్యములన్నిటిని సాధించుటకై ద్యూత, మద్యపానంబు లోపనిపై విరివిగా సాగింపవలయును. కాని మీరు కడు జాగరూకతతో మాత్రము మెలంగవలయును.

తేగీ॥ కంటికగపడకుండ లోకమున నెందు
నిండిపారియుండునట, మీరు నేర్పుగలిగి
యతని కగపడకుండ మీమతము నెల్ల
క్రమముగా నెరవేర్చి నాకడకురండు॥

(అందరు) చిత్తము మహారాజా, మేమిక పోయివచ్చెదము.
క—అవశ్యము మీకు దిగ్విజయము చేకూరునుగాత !
(మంత్రులు నిష్క్రమింతురు)

తే॥గీ॥ కాలమా, యింక కలిరాజు పాలబడితి
వేమిజేసెదవిపుడు? నీ వెగిరిపడిన
యూరకుండదు పీడ నీ వూరకుండు
నా యనుజ్ఞకు లొంగియుండవలయు॥
(నిష్క్రమించును. తెరపడును)






## తృతీయాంకము.

---

### కలియుగము

### 1-వ రంగము.

[కలిబ్రాహ్మణులు]

---

(ప్రవేశము: వెంకయ్య శర్మ)

వెం—తే॥ గీ॥ జన్మలకునెల్ల నరజన్మసార్థకంబు
నరులలో బ్రాహ్మణులె పుణ్యనరులు జగతి
అట్టి బ్రాహ్మణకులములో బుట్టినాడ
నింక నాకేమిలోటు నాకెవరుసాటి ?

మేమేది చెప్పితే అదే వేదం, ఇతరులకు వేదం చదువుకోటాని యర్హత లేకుగదా, ఉన్నా వాంళ్ళకాగోడవ పట్టదు. మాకు పట్టినా పట్టకపోయినా మా పెద్దలు చదువుకున్నారు కాబట్టి మాకు తెలుసునన్నమాటే. సరి, సరి, అసలు సంగతి మరిచిపోయినా, ఒకే, ఓబయ్య శాస్త్రి, ఓబయ్య శాస్త్రి! (తెరలో—ఓయ్—ఓయ్)

వెం—యిటురా, యిటురా.

[ ప్రవేశం-ఓబయ్య శాస్త్రి. ]

ఓ—ఎందుకు ?

వెం—మనము మొన్న అనుకున్న సంగతి యేంచేశావ్ ?

ఒబ—ఏది! ఓహో, అదా! నీవు చెప్పింది బాగానే వుందిగాని, మన పూర్వాచారానికి విరుద్ధంగా వుంటుందేమోనని సందేహంగా నున్నది.

సు—సింగినాదం— "కాల మొక్కటి రీతి గడపవలయు" అన్నారు. కాలమానపరిస్థితుల ననుసరించి వర్తించాలిగాని, యెల్ల కాలం వక్షలేమో స్తరా? ఈకాలానికి డబ్బు ప్రధానం. అదిలేకుండా ముక్కుమూసుకొని కూర్చుంటె, యెర్రిబాహ్మలంటారు.

ఒబ—సరేకానియ్,—నామట్టుకు నేను చద్దన్నము తిని బయలుదేరి మూడుఝాములదాకా తిరిగి రోజుకు అర్థడబియ్యం సంపాదిస్తాను. ఇంతచద్దన్నమో ఇన్నియేసీళ్ళో కడుపులో పడితే రోజుకు 4,5 తద్దినాలు పెట్టిస్తాను. తద్దినానికి రూపాయికి తక్కువ యిస్తే వొప్పుకోను. ఇక పుష్కరాలు, పుణ్యతీర్థాలు వస్తే డబ్బుకేమీ తక్కువలేదూ.

ం—భేష్, బాగున్నది. ఇకనావంతు వ్యాజ్యతగాదాలు దస్తావేజులు లంచాలు అన్నినావే-వాడిజుట్టువీడికి వీడిజుట్టువాడికి ముడివేసి యెలాగోలాగు డబ్బుసంపాదించటం మనకు కావలసింది. ఈ రోజులలో కోర్టుకు ప్లీడర్లకు కొదవలేదుగదా. ఇక మనము వ్యాజ్యరయితులను నిద్రపోనియ్యం అదుగో యెవరోవస్తున్నారు. నీవీదారిని పో. (శాస్త్రినిష్క్రమించును)

(ప్రవేశము రెడ్డి)

రెడ్డి—ఇదిగో, కరణాగారూ, మీరీయిపరీతం యిన్నారూ. మనూళ్లో రెండుపాట్టీలున్నయిగదా, యెప్పుడైనా మీరు మాకన్న ముందుకమ్మోరికి సభలో తాంబూలం యిప్పించారూ? ఈ యిషయంలో తలకాయలు తలకాయలు పగలాలిసిందే! నాలుగు డబ్బులుపోగుగాంగానే వారిని కమ్మవారు అనాలటా, మమ్మల్ని రెడ్లు అంటారట-యిదేం నాయం సెప్పండి

వెం—ఎవరు వారిలో కట్టుదల?

రె— ఆ, ఆయనుండలా, సాలు గింగిలీషు ముక్కలు నేర్చుకొచ్చి చౌదరీ అనిపేరు పెట్టుకున్నాడే, ఆయన

వెం—సరే ఆయనేనా? వీటన్నిటికీ వేరే యొక యుపాయమున్నది (రహస్యముగా) నీకెందుకు ఆయనమీద 400 రూక నోటు వ్రాయించి కంప్లైంటు చేస్తాం దానితో అన్నిరిమ్మలు కరుస్తాయి

రెడ్డి—అదేందో వుపాయం సేస్తారనిగాదూ మీదగ్గరికొచ్చింది!

వెం—సరే పోదాంరా. (నిష్క్రమింతురు)



రెండవ రంగం

(ప్రవేశము కొమ్మలచౌదరి. మీసములు దువ్వుకుంటూ)

చౌ—పుట్టటం అంతా ఒకటేమోస్తరుగా పుట్టారుగదా, ఈభేద లేమిటో! వారెక్కువేం మాతక్కువేం?-ఎవరికివారే; వారికి మేము వంగివంగి సలాములు సేయటమేం మమ్మలను వారు వేయ్, ఓయ్, ఏమోయ్—అనటమేం?

[ప్రవేశం-ఓబయ్యశాస్త్రి బుడిచెంబుతో]

ఓబ—హరేరామ—హరేరామ—(పైకిచూచి) ఎవరానుంచున్నది (జవాబులేదు) అయ్యో, పలకరేం?

చౌద—మేము కమ్మవారం.

ఓబ—కమ్మవారు-ఎవరునీవు? (పారజూచి) నీవు—చౌదరీవి టోయ్

చౌద—ఓయ్ అంటే మళ్ళీ ఓయ్ అంటారు.

ఓబ—ఓయబ్బో—నీపని అంతవరకు వచ్చిందీ?

చౌద—ఆ, రాకేం-ముష్టిఅడుక్కున్నే నీకే అంతవుంటే మాకుండదూ

బ—సరే, సరే, నీతో మాట్లాడటమే బుద్ధితక్కువ-రామ, రామ కలికాలమని వూరికే అన్నారు!

(అని తలవంచుకొనిపోవును)

చౌద—ఇలా మొదలుపెట్టితేనేగాని వ్యవహారం కుదరదు. కుక్కకాట్టికి చెప్పుదెబ్బ - వేదాలు వారే చదువుకోవాలటా-మాకు అర్హత లేదట-ఆరే వూడిపడ్డారుగా మోసు-ముమ్ములను పిచ్చిముండాకొడుకులను చేసి యెన్నాళ్లాడిస్తారో చూదాం.

(ప్రవేశము-మాదిగనందుడు.)

(చౌదరీగారికి సమీపముగా తొందరమీద పోవును)

చౌద—అరే, గాడిదకొడకా, వళ్ళుపై తెలియుటంలా?

నం—లేదులెండీ బాబూ, దంణాపెడతా-తొందరమీద పోతుండా,

చౌద—ఛా-గాడిదా, బ్రాహ్మలయితేనే దూరంగావుండాలనుకున్నావ్ నీకంటికేం దిసాయించుండలేదా యేం - జాగ్రత్తగా బతుకులమ్డాకా?

నం—యేందండీ-మా వూరుకుంటున్న కొద్దీ, మీదిమీదికొస్తున్నారూ?

చౌద—ఛీ-నోరుముయ్యి-చెప్పుతీసుకుతన్నేను (చెప్పువిడిచి చేతపట్టుకొని) మా బజారుకొచ్చి పైగా నాంభూకరిస్తావేమ్?

నం—కొట్టండీ—యేంచేస్తాం—మాకర్మనునింపమంటాం—అంతేనా యింకేమన్నా చేస్తారా? ఆ ఊపు అంటే మాజీవనంతీస్తారూ? తియ్యండిఅంతకంటె యేంచేస్తారూ; [అనుచు నిష్క్రమించును]

చౌద—ఇంకా నయం—నాలుగురోజులుంటే మాయిండ్లల్లోకికూడ వస్తారు? ఒక్క-బాహ్మలకే కొమ్ములుతిరిగినవనుకొన్నారుగా మాలు. ఇహ జాగ్రత్తపడకపోతే లాభంలేదు.

[ నిష్క్రమించును ]

---

## 3 వ. రంగము.

---

(ప్రవేశము-సారా(విస్కీ)బుడ్డి చేతపట్టుకొని కుశాల్ రావు)

కుశాల్ — వాకే, వా-ఏమిరాదీని మజా! ఇది ఫ్రెంచివిస్కీ! (గుటగుటా తాగుచు) బలే, బలే, యీసీసా యావునీ తాగితే యీసారా తాగాలి- పోతే యీమిఖీదగ్గరకే పోవాలి యీరెండు లేనివాడి బ్రతుకు బ్రతుకేనా.

ఉ॥ ఘోరుగ విస్కితాగి, కడుపోకగు సిల్కులు గ్లాసుగోలు సాం పారధరించి మన్మథుడో యాతనియమ్మ మొగుండో యంచు న న్నారసి వాలుకండ్ల నిటురా యిటురా యని సైగసేయు న వ్వారలలామలన్ గలయ స్వర్గ సుఖంబిక వేరనున్నదే॥

అహా! అందం అంటే వీరిదే అందం!

శా॥ అందంబొక్కటె యెంచిచూడనల రంభా మోహినీ తారలున్ క్రిందై పోదురు వారకామినులకున్; ప్రేమాది స్త్రీచిహ్నముల్ గందోయున్ గదలించుటల్ పసిడిమేల్ కాయంబు గుల్కించుటల్ చందోయున్ మెరపించుటల్ భళిర! వేశ్యాకాంతకే జెల్లెడిన్।

అహా, వారి లాలన యేమి!

సీ॥ ప్రియుడ నీకొరకేను వేచియున్నానురా
యని కవుంగిటిజేరి హాశ్యమాడు,
నీకన్ననన్యులు నాకేరు లేరురా
యని మోము గదియించి యదుముకొనును
ఫ్రెంచిజాకెట్లు తెప్పించివావాయంచు
ముసిముసి నగవుతో ముద్దులిచ్చు
నతికన్న పదిరెట్లు చనువుతో జేబులు
సవరించి కాసుల సంగ్రహించు

గీ॥ వేడ్కఁదొడఁ శయ్యపైఁజేరి, విటుఁడ, నన్ను
విడుతువా యని దీనయై వేడుకొనును,
అహాహా! యొకసారివారి ముఖాబ్జములను
జూచితరియింపకిక వేరుసుఖముగలదె!॥

(మరల విస్కీ రెండుగుక్కలు త్రాగి)

ఆనాడు పెండ్లి యూరేగింపున భోగము మేళములో యామినీ సుందరిని చూచినప్పటినుండియు నాకు నిద్రాహారములు లేకున్నవి. ఆహా! యేమి దాని సౌందర్య మహిమావిశేషము బలే బలే!

ఉ॥ చాలురదాని మోమునొకసారి సరాసరి జూచుకొన్న, ము
త్యాలసరాల నీను ముఖాబ్జము నవ్వులమూటగా, బలే,
బాల వరాల మూలర, శభాస్, రమణీమణి టక్కుటెక్కు నా
లాలితమేని సొంపుఁగనులార గనుంగొనకేటి జన్మరా॥

ఉ॥ ఏటికి సంపదల్ మరియు నేటికి రిత్త సుఖంబులందు, వే
రేటికి స్వర్గసౌఖ్యమది, యేటికి వ్యర్థపు పాడుజన్మ, యిం
కేటికి సర్వ మిప్పుడమి, యీరతనాంగులతోడఁగూడి యా
మేటి సుఖంబుగాంచ కయె మేదిని మానుషజన్మమానుకో॥

( వహ్వా-శహాభాస్-అని విస్కీ త్రాగుచు స్వగతప్పి )

కీర్తన.

1. యామినంటె యామినీర, కామినీ-దాని మోము జూస్తే నోరూర్తది భామినీ॥ యా॥

2. మోముజూపె భామినీ-నాకొక్క - ముద్దు నీయవె కామినీ! కాముకేళి దీర్పరావె నామణీ, నీముద్దు - నామస్మరణ సేయుచుందు యామినీ॥ యా॥

3. ఓసోసి యామినీ, నాసొగసు కామినీ, విస్కీ తాగు భామినీ, సోకు సూడు వామణీ॥ యా॥

4. బలే-బలే-బలే-నే, నెల్తుండె యామినింటికి, రానీయ నెవరి దానింటికి, పోనీయ నింక దాని నెచటికీ, మానానింక దానిసేవ నెప్పటికి॥ యా॥

(నిష్క్ర......)

---

4-వ రంగము.

—• యామినీసుందరి •—

యా—

చ॥ పురుషులమంచు గర్వమున పొంగుచు, మీసములన్ సడించుచున్
మరిమరి విఱ్ఱవీగుచును మాటికిమాటికి "ఆడవాండ్లమే
పిరికితనంబుజూప" నని ప్రేలెదు వీరలె మాపదంబులం
దొరిగి నమస్కృతుల్ సలుపుచుండరె బానిసలొచు సర్వదా॥

సీ॥ మీసముల్ మెలుపుచు మిట్టిపడెడి వారిఁ
గనుసైగ మాత్రానఁ గట్టివైతు
కన్నుమిన్నునుగానక యెమండిపడువారి
నెక్కువాలూప్పుకే నుక్కడంతు
అతిపరాక్రమశాలులౌ ధీరులనుగూడ
పలుకులోన నె వశపరచుకొందు
రాజరాజులకును గాజులుదొడిగించి
మంచంపుకోళ్ళ బంధించియుంతు,

గీ॥ మేటిలక్షాధికార్ల నిమేసమునను
స్వల్పభిక్షాధికార్లగా సలుపుచుందు
పురుషజాతినే 'తహాతహా' పరుచుచుందు,
ఔర! యామినీ సుందరి కసాధ్యమగు నిశేది?॥

నాసామర్థ్య మెంచుకొనిన నాకే ఆశ్చర్యమగుచున్నది.

శా॥ కాసుల్ కంటెలు సొంతమూడ్చితిని గూకల్ పెక్కుగా జేసి యెం
తో సౌభాగ్యము జేర్చుకొంటి, మరియెంతో మందినాచేత స
న్న్యాసత్వంబుగ్రహించి "దేహి" యనుచుఀ యాచించుచున్నారహా!
నా సామర్థ్యమెఱుంగ బ్రహ్మకయినన్ సాధ్యంబె యోజింపగన్!

ఆడుగో నాగరత్నంవస్తున్నాడు. ఇతడు సొంతమైనాడుగాని, యితని యాస్తి కాజేసేయుపాయము లాలోచించవలెను.

(నాగరత్నం ప్రవేశించి, తనలో)

నా—ఈనాడెంత ప్రయత్నించినను రూపాయి కూడ దొరకదయ్యె. నేడు నాగతి యేమగునోయేమో! కానిమ్ము ఇంతకాలము నుంచియున్న స్నేహమింతమాత్రమున నే బోవునా!

యా—ఓహో నాగరత్నంగారా, యివ్వాళ మేము జ్ఞాపకంలేదు గాబోలు.

నాగ—ఆ, యెంతమాటన్నావు!

(అనుచు సమీపమున కూర్చొనబోవును.)

యా—అయ్యా, సమస్తము తెలిసిన మీవంటివారు స్త్రీలపై నిట్టి చనువు తీసికొనరాదు.

నాగ—(తనలో)ఓహో, యిది బెట్టుచేస్తున్నది! ప్ర॥ నీకోర్కె కొనసాగించక వచ్చితిననియా నీ యూహ!

యా—అట్లున్నటికి రాలేరని నాకు తెలియును.

నాగ—చెలీ, నా మనవి యొక్కటి వినుము.

యా—నాకీరోజున కొంచెయు పనివున్నది. నేను పోవలె.

నాగ—నాకున్న సర్వసంపదలు నీ యాధీనము చేసితినని:నీవే యెఱుగుదువు.

యా—నీకన్న పది రెట్లెక్కువ జేసినవారెందరున్నారు?

నా—నీ వల్లనైన దైన నాకు చెప్పియుంటివా?

యా—నీతో వివాదమునకు నాకవకాశము లేదు.

నా—యామినీ, నీవిట్లందువని నేనెన్నడు తలంచలేదు. నాస్థిరాస్తి యంతయు నీపేర బెట్టుటకయి యీరోజు పత్రము వ్రాసుకువచ్చితిని

యా—(చిరునవ్వుతో) నాగరత్నంగారూ, యింతలోనే మీమొగం అలా నల్లపడ్డదేం? (అని సమీపమునకు జేరి మీఁద చేయివైచును)

నా—చెలీ, నీకెక్కడ కోపమువచ్చునో యని యట్లుంటిని. నాతలిదండ్రులు నామెడకంటగట్టి నప్పటినుండియు నాపెండ్లామన్న నాకసహ్యము. పంచప్రాణములను నీపైననే పెట్టుకొని యున్నాను. అందువలననే నాయాస్తినంతయు నీకర్పించుటకు సిద్ధమైతిని నాసర్వమును నీచేతిలో పెట్టితిని.

యా—ప్రియా, ఇన్నాళ్ళనుండి నన్ను నీవెరిగియు నిట్లనుమానపడెద వేమి? దినదినము నాకొరకెంతమంది వచ్చి తిరిగి పోదురో నీవెరుగవా? నీమనస్సు కనిపెట్టుటకై మొదట నట్లుపలికితిని.

మ॥ నినుగన్గొన్న క్షణంబె నామనములో నీపైన గాఢంబుగా
ననురాగంబొదవెన్, నినున్ విడువ నిద్రాహారముల్ గల్గునా
యను భీతావహ లో జనించెడు ప్రియా, యాశ్చర్య! మన్యోన్య ప్రే
మను సృష్టించె పరాత్పరుండు మన జన్మంబింక ధన్యంబుగా॥

నా— మ॥ చెలియా నాపయినస్న ప్రాణములతో చిన్నారిపొన్నారివై
కలుమం బెప్పుడెటుంగ కీ యిటుల నన్ గాఢానురాగంబుతో
దలపన్ నాకిక చీకుచింతగలదే? దైవప్రయత్నంబుగా
గలిగెన్ నీకును నాకు చెల్మి, మనసౌఖ్యం బెన్న శక్యంబొకో॥

యామినీ: సుందరీ, నీకొక్క మాట చెప్పెదను వినుము,—

తే॥ గీ॥ ఒల్లనీక బంధుమిత్రుల నొల్లనసతి
చిన్నతనమున మెడగట్టుకొన్న సతిని,

ఒల్లనిక నిల్లువాకిలి, నొల్లనేమి
నిన్నుదక్క వేరుగ యామినీ లతాంగి॥

ఇదిగో, నాయందు నీకెట్టి శంకయును లేకుండ నీపత్రమును సమర్పించుచు సర్వమును నీయధీనము చేసితిని.

( అని దస్తావేజు చేతికిచ్చును. )

యా—(పత్రముఁ బుచ్చుకొని) ప్రియా, నీకన్న నాకీతుచ్ఛపు ధన మొక లెక్కయా. నాయందు నీకు గల యనురాగ మెరుంగుటకై యడిగితినిగాని వేరుగాదు. ఈపత్రము మన యిరువురిలో నెవరి దగ్గిరనున్ననేమి. యుండనిమ్ము (అని రెవికె జేబులోనుంచు కొనును.

(బయటతలుపు చప్పుడి)

(లోనయామినితల్లి— ఒసే, అమ్మాయ్, నీ తెలివిపాడుగాను. ంతసేపే)

అదిగో, మాఅమ్మ కోపపడుచున్నది. ఆమె బహు ముక్కోపి గాకు బహుపీడగానున్నది. మీరు వెళ్ళిరండీ.

రాగ—అలాగే-తొందరగావస్తా-ఇదిగో ఒక్క ..... (ముద్దు)

యా—మరల వత్తురుగాని ఈవాకిలిన వెళ్ళండి.

రాగ—సరేసరే— (అనుచు నిష్క్రమింతురు)

(అతిత్వరలో శయ్యను చక్కజేసి.)

యా—దీనివలన 10,000 లభించినవి. దీంతో సాంతము — ఇక యీ యన దగ్గరనున్న...

(మరల తలుపు చప్పుడి)

ఓహో కుశాల్‌రావు గాబోలు. ఈయనను జేరతీస్తేనేగాని ాకంట పండదు.

(మరల తల్లి—అమ్మాయ్, అయిందిలే)

యా—ఆ ఆ. తలుపుతీయ్.........

కుశాల్‌రావుగారి వేలుంగరము నాకండ్లల్లో మెదులుతు యున్నది.

[ప్రవేశం కుశాల్‌రావు—విస్కీ-బుడ్లతో]

కు—[విస్కీ-తాగి]

—• కీర్తన •—

అహా- ఆడదంటే యాడదిదేరా !
దీని- కూడకుంటే జన్మలేదురా ! ॥
ముద్దులోల్కు- ఆడదీరా, మోహందీర్చు జోడుదీరా,
పొద్దున్న లేచి దీన్నిముద్దు పెడితేయుందిరా॥ అహ॥
బలే - బలే - బలే!

యా—మా బావగారికి మామీదదయలేదు !

కుశా—[మరల విస్కీ-తాగుచూ]

మజా- మజా- వహ్వా- దయలే
దంటే నే నూరుకోను- ఇదిగో
తీసికో (అనినోట్లకట్ట విసిరి మీదపారవేయుచున్నాడు)
చాలునా యింకా కావలెనా ? చెప్పు సిగ్గుపడితేలాభంలేదు

యా—మీయనుగ్రహంవుంటే మాకేంకొదవు ?

కుశా—ఇదిగో యింకొకటి తీసుకో.

(అనికాసుల పేరు మీద పారవేయుచున్నాడు)

యా—[అవిచేతతీసికొని] తమ రిలాదయచేయండి (అనిసమీపించు

కుశా—ఊరికా పోనులే-నీ కాభయంవద్దు. (కౌగలించుకొని శయ్యు కీడ్చుకొనిపోయి )

ఇదిగో, యీఫ్రెంచి విస్కీ- రుచిచూడు—(అని యిచ్చున

యా—తమరు కానియ్యండి:

శశా—నువ్వింకొకటి తీసుకో (అని సీసాపూర్తిగా తాగి) ఇదిగో-ఇదిగో
యీమజా-మజా ( అని ముద్దుపెట్టుకొనుచు )

ఉ॥ తాగిన, విస్కి-బుడ్లొకటి తాగవలెన్ సుఖియింపనెంచుచో
భోగమువారితో నెపుడు మోహముదీర సుఖింపగావలెన్
జోగులమ్మారి భార్యలును శుష్కజలంబును మోహదాహముల్
బాగుగ దీర్పగాగలవె భావమునన్ దలపోసి జూడగన్ ॥

సూ—తమరు చాల యలసినట్లున్నారు-కొంచెము విశ్రమించెదరా!
శశా—అలసి-గిల్సి-నాకు పనికిరాదు. నిన్ను సూస్తే-ఊ-ఊ...
సూ—(తనలో ఈతనికి మతిభ్రమ జనించుచున్నది ఇదే సమయము)
( చేయిపట్టుకొని,)

ఆహా! మీ వేలియుంగర మెంత యందముగానున్నది!
శశా—తీస్కో-తీస్కో నాకొద్దులే-తీస్కో.
సూ—( నెమ్మదిగా నుంగరము లాగుచు ) మీకేమి, మహారాజులు
మీ కిది యొక లెక్కా!
శశా—ఇదిగో రాజగీజు మాట్లాడితే నే నూరుకోను-అరే- నీవు నా
బావవురా-బలే-బలే. ( పూర్తిగా భ్రమతప్పును. )
సూ—"ఇంక యీతని కడ నుండరాదు." ( అని లేచును. )
శశా—ఇదిగో పోయినావంటే నన్నెరుగుదువా అరే, నీయమ్మ కొడు
కా కూతురా, ( అని లేవబోయి క్రిందబడును. )

సూ—ఇంక నే నిప్పు డేమైనను చేయవచ్చును. (జేబులుతమిడి నోట్లు
కాగితములు సంగ్రహించి ) ఈయనకు తెలివివచ్చులోపల నే
నింకొకపనిని ముగించుకొని వచ్చెద.

( నిష్క్రమించును )

( తెరపడును )

---

5 రంగము

మహ్మామద్ మస్తాన్

[హుక్కా తాగుచు కూర్చొని]

మ—అరే. మాకీమహమ్మదీయ మతం హిందూ దేశంకు వచ్చిం మొదలు హిందువులకు హడల్- హడల్- ఇస్కీ మాకీ సెప్పితే మళ్ళాకబద్దార్ -అరె వాంళ్ళకీ క్యామితం! రాయిం డు చెట్టుదేవుడు! వారెవా! క్యామనిషీ క్యామతం- సైతాన్ ఇదరావ్ జల్దీసూవ్

తెరలో (ఆతే సర్కార్ ఆతే)

(ప్రవేశము, సైతాన్ ఓబయ్య శాస్త్రినీడ్చుకొనుచు)

సై—దేఖో సర్కార్ దేఖో ఓబామ్మన్ పిశాచాహాయ్

మ—అరె, ఓక్కైకు ?

సై—ఓసర్కార్ యీడుసెప్తాడూ తురకాణ్ణి ముట్టుకుంటే చర్మం సిమెయ్యాలటా. ఆడ గప్పాల్ కొట్టు తుంటే మాకీయా కొచ్చాం దేఖో- దేఖో- సర్కార్- దేఖో

మ—అడీ క్యారే బామ్మన్ - నీకీ క్యాబోత్తే!

ఓ—మమ్ములను హింసించిన కొలది మీరు నాశనంతప్పదు. మీ మ్లేఛ్ఛులు. మిమ్ముముట్టుకుంటే చర్మము కోసివేయుమని శాస్త్రములు చెప్పుచున్నవి. నన్ను చంపినను సరే, నేనా టవిడువను.

మ—అరే బాథకో బాత్నఖో- బాత్నఖో- సైతాన్ యీడి కోసి వదిలిపెట్టు- జావురేసువర్ జావు-

సై—మాకీజుట్టుగిట్టు కోసేస్తాం సర్కార్; అవ్ రే అవ్ [అనియీ కొనిపోవు చున్నాడు]

మ—ఆళ్ళు జుట్టుపైన పెడితే మాకీముక్కుడ గడ్డానికి పెడతాం ఆడుకింద గొరిగితే మేము పైనగొరుగుతాం మళ్ళీమాటాడితే వాడికీ కూచ్చోని వుచ్చాపోస్తే మాకి మాకీ నించోని బోస్తాం వాంళ్ళ మేళంగీళం మామసీదులకాడా యినపడకూడదు. మా కు సెప్పిన మాట వాడు యినక పోతే మాకీలడాయి చేస్తాం మాకీ ఒకడికే వాడికి వందమందికి సమానం, దేఖో ఆడికి యెక్యా మాకీ తక్యాదే!

(తెరలో గలభా)

అరె ఓక్యా హిందూసువర్ కొట్టుకొట్టు అరే సైతాన్ మైయా తారే హైరో, హైరో

[నిష్క్రమించును]

6వ రంగము.

(ప్రవేశము: మాదిగనందుడు, భార్య మాలక్ష్మి.)

నం—కటకటా, యేమి మా దురవస్థ-పొట్టకూటికిగూడ దారి జూపిం చక నా పాపిష్టి దేవుడు మమ్మీల పుట్టించెనోగదా!

సీ॥ వ్యవసాయవృత్తి జీవనము చేయుదమన్న
చేరెడుభూమికే దారిలేదు,
చేతివృత్తులు జేసి జీవింతమన్నచో
కాని డబ్బైన మాకడ పుట్టదు,
కూలినాలిని జేసికొని బ్రతుకుదమన్న
దరి జేరనీరు మమ్మొరులు నంత
యాచించుకొని పొట్టగాచుకొందమటన్న,
యిండ్లకే రానీయ రెవరు మమ్ము

గీ॥ కడకు చచ్చినగొడ్ల మాంసములుగ జేసి
తినుచు జీవించు గతి కల్పించె మాకు;
బాపురే! యిట్టి దౌర్భాగ్యమానవులుగ
జగతి పుట్టించె గద మమ్ము సర్వమయుడు॥

మాగతి దలచుకొన్న మాకే దుర్భరమగుచున్నది.

తే॥ గీ॥ ఊరిబయటనే నివసించుచుండ వలసె
గొడ్లకోయుచు చెప్పులు గుట్టవలసె
తుదకు చారెడుగింజలే దొరకకున్న
చచ్చు మాంసంబు తిని కుళ్లి చావవలసె॥

కటకటా! విధాత మాకిటుల వ్రాసెను గాబోలు.

సీ॥ కనిచూపుమేర నెక్కడగానబడిన ఛీ
ఛీ! పొమ్మనుచు చేయి నూపువారు,
వీధులలో మేము వెడలుచున్నంతనే
యేవగింపున కూకలిడెడువారు
గ్రామంబులో నెందు మేము మాటాడిన
వినకుండ చెవిమూసికొనెడువారు
మేముతొక్కినదారి తాముతొక్కగ పాప
మనుచు నీళ్ళను జల్లుకొనెడివారు

గీ॥ విసిగి వేసారి మాటాడ, గసికొలంది
పాదరక్షలు విసరుచు బాదువారు,
చెప్పరానట్టివారని చెప్పుకొనెడు
వారు, కటకటా! మాకు దిక్కెవరుచూడ॥

అయ్యో, యాకలిగొని నా పసిపాప లల్లాడుచున్నారు. వీరి కిన్ని నీళ్ళైనబోసి రక్షించుకొందమన్న నాలచ్చి యింకను నీళ్ళకుబోయి

రానున్నది. నీరింకను చిక్కునో లేదో గదా!

(తెరలో నేడుపు)

అదిగో నా లచ్చిగాబోలు నేడ్చుచు వచ్చుచున్నట్లున్నది- హా దైవమా! ఏమి మూడెనో గదా!

(ప్రవేశము: మాలతల్లి యేడ్చుచు, పగిలినకుండ నెత్తినబెట్టుకొని)

మా—

మ॥ అకటా, నే నొక నీటికుంటకడ కత్యాశాయుక్తిఁ బోయి కుం
డకు నీరెత్తుకు వచ్చుచుండ, పసి, ముండా, యాగవే, యంచు చెం
తకు వేగఁ జని చెప్పులన్ విసరి లంజా, తాతసొమ్మా, యిటుం
డుకు నీరంటితివంచు కుండ పగలన్ గొట్టెన్ జనంబయ్యరో!

అంతట నేనేమియు సేయజాలక యింటికివచ్చితిని,

నం—హా దైవమా-ఎట్టికష్టములు వాటిల్లెను:

మ॥ జనులెల్లన్ మము సేవగించి యిటు నీచానీచతన్ జూచుచుం
డ, నికెవ్వారికి జెప్పుకొందు మరెరే! నారాయణుండెందు బో
యెనో! మాకెవ్వరుదిక్కు? మేమెవరితో యీఘోషవిన్పింతుమిం
కను మాపంచమజాతి భూమి బ్రతుకంగానీయరే, దైవమా!

చ॥ కడుపుకు కూడు నీరయిన గావలెగాదె మనుష్యజాతికి
ప్పుడు జలమైన దీసికొని పోవగ నోచుకొనంగ లేదె? యె
య్యెడ మము జేరనీయకయె యిష్టమువచ్చినరీతి నెన్ని రో
యిడుమల బెట్టుచుండ నిక నేవిధి మేము భరింతు మీశ్వరా!

నం—ఓసీ, మనమింక యేడ్చి ప్రయోజనము లేదు. ఊరకుండుము.

మా—అయ్యో, ఏడ్వ కింకేమియున్నది.

ఉ॥ ఎందుకొ యీశ్వరుండు మన నిద్ధర సృష్టి యొనర్చి యీవిధిన్
గుందగఁ జేయుచుండె? దయ కొంచెము లేక జనంబులెల్ల మా
యం దిటువంటి క్రూరత దురాగ్రహ మూనుట యెందుచేతనో!
డెందమునందు తోచదు, వడిన్ హరి తీసుపోవడేటికో!

కటకటా! ఈ యగచాట్లు పడలేము!
(అని క్రింద కూలును.)

నం——అడుగో మనపాలిదైవమువలె యెవరో వచ్చుచున్నారు. ఆయనను వేడుకొందా మూరకుండుము:

(ప్రవేశము ఫాదరీ)

(తెల్లనిగడ్డము-పొడుగాటి తెల్ల అంగరకా నెత్తిపై బుట్టటోపి (Hat) వగయిగా)

ఫా——సోదరులారా, ఏడువవద్దు-ఏడువవద్దు (అని సమీపించును)

నం——(తనలో) ఈయ నెవరో మనదిగ్గరకుగూడ వచ్చుచున్నాడు. మన పాలిదైవమేమైయుండును.

ప——అయ్యా దండాలు——మీ కాళ్ళకు
మొక్కులా——మేము అంటరాని వాం
ళ్ళము——దయచేసి దూరముగానుండుడు.

ఫా——మాకు అమైలలేదు- మనుష్యు లందరు మాదృష్టికి సమానులే నీకు నీవే యేలతక్కువగా జూచుకొందువు?

నం—— అయ్యా, మేమట్లు చెప్పకపోతే వారయి చెప్పులు విసరి కొట్టుదురు. అందుకని మేము ముందే చెప్పుకొనుచుందుము.

ఫా—— అదివట్టి పిచ్చితనము, మీహిందూమతములో అందరు వట్టి మూఢులు, దేవుని దృష్టిలో ఒకరెక్కువ ఒకరుతక్కువ యుండరు. అందరికిని ఆ క్రీస్తువొక్కడే దేవుడు. మీరు మూఢులై రాళ్లను చెట్లను పూజించుచుందురు. మీరాముడు కృష్ణుడు దేవుళ్ళు కారు- మీరు సరియైన దేవుడిని పూజింపకపోవుటచే మీకీకష్టములు గలుగుచున్నవి. మీదుసిత్థిని జూచి మిమ్ములను బాగుచేయుటకయి యింతదూరము సీమనుండి మేము వచ్చియున్నాము. మిమ్మును మాతో సమముగా జూచుకొందుము

మాదగ్గరకు రానిత్తుము. మామతంలో మాదేవుడికి మ్రొక్క-వచ్చును. మీకు అన్నిసుఖములు వుండును. చదువు చెప్పించి మిమ్ము బాగుచేసెదము. మామతమును పుచ్చుకొనుడు

సం—అయ్యా, ఒక్కటి మనవిచేస్తా తమకు కోపంవద్దు.

ఫా—ఏమిటి చెప్పుము-చెప్పుము.

సం—మా తాతలనాటినుంచి మేము రాములవారిని, కృష్ణమూర్తిని, పోలేరమ్మ, అంకాలమ్మ, మాలక్ష్మమ్మ, మొదలయిన దేవుళ్ళను, అమ్మవార్లను పూజించుచున్నారము. మాకు దాఖలాలు కనబడుచున్నవి.

ఫా—అది తెలివితక్కువ. ఆ రాళ్ళు చెట్లు దేవుళ్ళుకావు. మీకు కావలస్తే మీ దేవుళ్ళను నేను కాళ్ళతో తన్నెదను ఏమి చేయునో చూడండి. క్రీస్తుదేవుడొక్కడే మనకు దేవుడు. ఆయనకు మొక్కితే మీకు అన్నిసుఖములు గలుగును. నామాటలు విని మామతమునకు వచ్చి చూడండి. లేకపోతే మీరు చెడిపోతారు.

సం—అయ్యా, ముందు మమ్మును వూళ్లో యిన్నినీళ్ళు తీసుకోనిచ్చి మా కింతకూడు పెట్టితే చాలును.

ఫా—ఓ, అవస్యం చేస్తాము. మనమందరము సమానమే. మీపిల్లలకు చదువు చెప్పిస్తాం. మీకు పనియిచ్చి బాగుచేస్తాం. మామతం పుచ్చుకుంటే మీరు బాగుపడుతారు. మీవూళ్లో యేబ్రాహ్మడినైనా నావద్దకు తీసుకువస్తే ఆయనను నోరుమూయించి మామతమే మంచిదని వొప్పిస్తాము. పోదాము రండి.

సం—అయ్యా, మమ్ము ప్రస్తుతము బ్రతికిస్తే అంతే చాలు. పోదాము దయచేయండి.

మా—అయ్యా, మాపాలిటి దేవుడివై వచ్చావ్ నాయనా.

ఫా—మీ పేరులు యేమి?

నం— నన్ను నందాయి అంటారు.

ఫా— అది చాలా అవమానము. ఇక నీకు "జాన్" అని పేరు పె
దము.

ఫా— నీపేరు ఏమి అమ్మా.

మా—నన్ను మాలచ్చాం అంటారు.

ఫా—అది బాగా లేదు. నీకు "మేరియమ్మ" అని పేరు పెట్టెదము
ఇదిగో, ఈ క్రాసు నీమెడలో కట్టుకొనుము. అది నిను
రక్షించును. మతమునకు పోవుదము రండు.

(నిష్క్రమింతురు)






## చతుర్థాంకము.

### 1 వ రంగము.

(ధర్మసిద్ధాంతి)

ధ—కటకటా! భారతసంఘమెట్టి దుస్థితికి వచ్చుచున్నది. ప్రపంచమున కెల్ల మార్గదర్శియై గుణపాఠమును నేర్పవలసిన హిందూసంఘము చివర కధోగతి పాలగునేమోయని భీతి వొడముచున్నది ప్రస్తుతస్థితి చాల సందిగ్ధముగనున్నది,

॥ ఒకవంక క్రైస్తవులున్నారు హిందూమ
తను నాశనముసేయు ధైర్యమునను,
ఒకవంకకడువేచి యున్నది పాశ్చాత్య
నాగరకత దృష్టి లాగుకొనుచు
ఒకవంకమనలో మనకు కులమత వైర
ములు కీడునెంతేని దలచుచుండె
ఒకవంక సంఘమందు కళంకమై పంచ
ముల బహిష్కారంబు మొలుత్తుచుండె

గీ॥ నీచమొకచెంప, నాశాపిశాచమొకట,
దాస్యమొకచెంప, మనభావదాస్యమొకట,
సిరికితన మొక్కచెంప, బీదరిక మొకట
పొంచియున్నవి మన దుంపతెంచుకొరకు॥

ఇంకను దేశమున దురాచారములను చూతమా మిది మీ
చున్నవి,—

సీ॥ బాల్యవివాహముల్ మతధర్మమైపోయె
బాల వితంతువుల్ ప్రబలమైరి
వరశుల్కములు చాల ప్రాబల్యమైపోయె
నన్నపానాదులు స్వప్నమునండె
వృద్ధులందరు పూర్వపద్ధతి వారైరి
పడుచువారింగ్లీషు బడులఁబడిరి
అసలు సనాతనం బడుగంటుచుండె సం
స్కారసమాజముల్ చాల పుట్టె!

గీ॥ స్త్రీలు వంటింటి దాసీలు చేయబడిరి
పేరు వడిన పాతివ్రత్య మారుచుండె,
వేడుకలును వినోదముల్ పెచ్చుపెరిగె
కటకటా! వింతలు జనించె కలియుగమున!

ఒకసమయమున హిందూమతమంతయు క్రైస్తవుల కాహుతిగా నున్నస్థితిగతులలో వివేకానందస్వామి మున్నగువారి యత్యద్భుత ప్రబోధమువలన మతము కోలుకొని క్రమక్రమముగా నన్యదేశములకు గూడనిప్పుడు వ్యాపించుచున్నది. ఇదియొక శుభసూచకమే. ఐనను నిమ్నజాతులలో క్రైస్తవమత మింకను వ్యాపించుచున్నది. (ప్రక్క చూచి) ఇత డెవరో యిటువచ్చుచున్నాడు. ఇతని జుట్టు వ్యవహారము చూడ యితడు మతములో కలిసినట్లు కనబడుచున్నది.

(ప్రవేశము నందుడు)

నం— బాబయ్యా, కాస్త తొలగి పోనీయండి, దయచేసి,—
ధ— మీ దేవూరు ?
నం- మాదొక యూరని చెప్పకొనుటకు నోచుకొనలేదండి బాబయ్యా

మేముండేది యూరిబయట.

ధ—నీపేరు ?

నం—నాపేరు నందాయి, కాదుకాదు, జాన్ అంటారండీ.

ధ—మీరెన్నాళ్ళయింది మతములో కలిసి ?

నం—ఎన్నాళ్ళు కాలేదు. మొన్ననే ప్రారంభం.

ధ—ఓహో ! మొన్న కలిసిన నందుడువి నీవేనా ?

నం—అవును బాబు నేనే

ధర్మ— నీకు హిందూమతంలోకన్న క్రైస్తవ మతంలో నేమి యెక్కువ గనబడుచున్నది?

నం— అయ్యా, నాకు మతవిషయమేమియు తెలియదు. అదివరకు మమ్ము వూళ్ళో బావి దగ్గరకు, బజార్లలోనికి గూడ రానిచ్చువారు కారు. ఇప్పుడు మాస్వాముల వారి సలహావల్ల శాస్త్ర నిర్భయంగా వుంటున్నాము. మేము శాస్త్ర చదువుగూడ నేర్చుకుంటున్నాము, ఇకముందుగాని మతవిషయములు తెలిసికొనుటకు మాకవకాశము లేదు.

ధర్మ— అయితే నీకేమి తెలియకయే నీపెద్దలనాటి నుండివచ్చుచున్న మతమును పాడుచేసుకొంటివా ? హిందూమత మన్నిమతములలోనను సర్వోత్తమమని వివేకానందుని వంటి మహనీయు లెందరో యున్నిమతములను పరిశీలించి సిద్ధాంతీకరించిరి. మీ కులంవారికి ముందు బాగుగా విచారించి క్రిస్టియన్ మతములోనికి దిగవలయును.

నం—అయ్యా, మళ్ళీ మనమతంలోకి రావటానికి వీలులేదండీ,

ధర్మ—సజాతునకు లేదనెడివారుగాని, యజ్ఞానులై మతభ్రష్టులైన వారికి ఆర్యసమాజమువారు హిందూమతములోనికి మరల చేర్చుకొను నవకాశము గలిగించినారు.

[ప్ర]వేశము: లతుకవత్తుల రాజమ్మ (పితంబుపు) బిందె నెత్తిన పెట్టుకొని

రాజ—హారేరామ, హారేరామ, రామరామహారే (అనుచు నీళ్ళు దారిన జల్లుకొనుచు వచ్చి, వంటవానిని చూచి) రామ-రామ నీదుంపమళ్ళీ తెంచుకొన్నావటరా! నీ ... న్వతియ్య. ఇవ్వాళ యిది మూడోసారి మీబొందమీద పెట్టుకోటం, నీతో... ముల్లె యేందాచిపెట్టావని యిక్కడకు చచ్చావ్ ముదనష్టపాడా ముదనష్టపాడా అని (నీళ్ళుక్రింద పారబోయును)

వంట—అయ్యో, అమ్మగారు తిట్టిపోస్తుంది నేను వెళ్ళతాలెండి (అని చాటుకు పోవుచున్నాడు.)

ధ—అమ్మా, మీరేల యాతనిని తిట్టిపోసెదరు? అతడేమి యపరాధము చేసెను?

రా—ఏ మపరాధమంటారేమండీ మీరు కూడాను, ఇవ్వాళ మీశాస్త్రిలుగారు వంట త్వరగా చెయ్యమన్నారని పొద్దున్నే నీళ్ళకొచ్చినా, యింతవరకు మూడుసార్లు నీళ్ళు పారబోసి వచ్చినట్లు వెనక్కు పోవాలసివచ్చింది.

ధ—అందు వాని లోపమేమున్నది?

రా—ఎంతనెమ్మళంగా మాట్లాడతావయ్యా, మాలకూడు కూడా తినమంటారు? మనవాంళ్ళకే పుట్టితే వాంళ్ళనంటే యేంలాభం?

ధ—అమ్మా, మీరు కోపబడకండి, మాలవాడు తినవలసి మిమ్మేమరన్నారు? వాడుకూడా మనిషికాబట్టి యేదోపనిమీద బజారున పోవుచున్నాడు. ఎంతో దూరముగ నీళ్ళుత్తుకుపోవు మిమ్మేమిచేసెను.

రా— అయితే ఈసీరంగ నీతులుమీకేపుట్టాయా. నుతంశాస్త్రం యేమన్నా యేడిసిందా? మీసిద్ధాంతి గారి దగ్గరకు రండి మీకని తెలుస్తుంది.

ధర్మ— అమ్మాయేసిద్ధాంతి గారూ?

రా— సరే, నేనేం అల్లరి చిల్లరదాన్ననుకున్నారాయేం? ఆచార సిద్ధాంతిగారు మా అన్నగారేగా?

ధర్మ— సరి, సరి, మీరు లక్షువత్తుల వారికోడళ్ళా యేమిటి?

రా— ఏమోలెండి. ఎవరికోడలినయితే, ఆ రోజులు వెళ్ళిపోయినవి,

ధర్మ— అయితే మీఅత్తవారింట్లో అంత ఆచారంలేదు గామోలునే!

రా— ఏమ్మోలెండి యీపాడురాత పట్టినప్పటినుండి నేనూ, శాస్త్రమేదు— స్త్రినే య్యున్నాను. అందులో మాఅన్నగారునిప్పువంటి వారు

ధర్మ— అయ్యయ్యో, చేసెనుగనూ. అయితే మీఅన్నగారు మట్టుకు శాస్త్రంలో యింతవిపరీతంగానున్నదనియంటారని నేననుకోను.

రా— సరే, ఇంకా మన్మాల్నాయన వత్తి వత్తి చంపుతుంటాను. (తనలో) కాదుగాని మనవాంళ్ళకే పుట్టింది. ఇంకా వాంళ్ళనేంమకసడం. (అని వెనుకకు బోవును)

ధర్మ— ఇదిగో అమ్మా, సిద్ధాంతిగారి దర్శనం చెయ్యాల ననుకుంటున్నాను ఎప్పుడుంటారు యింట్లో?

రా— ఎప్పుడూవుంటారో. భోంచేసినతరువాత రండి.

(అని నిష్క్రమించును)

ధర్మ—

మ॥ అకటా రోజుకు రోజుకీవిధము మూఢాచార ప్రాబల్యమై
సకలంబైన దురాగతంబు లిటులన్ సాగంగ న్యాయంబె? కా
వో! వారైన మనుష్యమాత్రు? లిల లేదో వారికీ చోటు! నో
ముకానన్ లేదట స్వేచ్ఛగా దిరుగ, నీ చోద్యంబు గన్గొంటిరే!

ఉ॥ ఎంతటినీచవృత్తులకు నేర్పడువారయినన్ జగంబులో
నెంతదరిద్రులైన, మరియెంతటి పాతకులైన బ్రాణము
న్నంతటిదాక మానవులు నా ధరవారును జెల్లుచుండరే
యింతటి వైపరీత్య మిల నెందుసహింతురె న్యాయమున్నచో!

తే॥ గీ॥ ఎన్నఁడో నాఁటి నీచులై యున్న కతన
సంఘమున బహిష్కారంబు సంభవించె
నేమొ తాత్కాలికముగ ; యిఁకెన్నటికిని
సంస్కరింపఁగవలదె సుజ్ఞానులెల్ల ॥

ఎట్టివారికిని పశ్చాత్తాపమున కవకాశమిచ్చి వారిని సంస్కరింప వలెఁగాని, సర్వదా వారి నణఁగద్రొక్కుచు మానవజాతికి కళంకమును తెచ్చుకొనుట మానవులకే నగుబాట్లచేటుగాదా? కటకటా! వారికష్ట ములెన్నటి కీడేరవలయునో గదా. దక్షిణాఫ్రికాయందు హైందవుల యెడ శ్వేత ముఖులకిట్టి దృక్పథమే గలదని వార్తలే తెలుపుచున్నవి. ఇట్టి యమానుషకృత్యముల సంస్కరించుటకే మహాత్ము డవతరించవలయునో గదా! నేనింక పోయి యాచారసిద్ధాంతిగారితో చర్చించి యెట్లైనను వారి దృక్పథము మార్ప యత్నించెద. దేశమున పూర్వాచారపరు ముఁవారి దృష్టి మరల్చినగాని కార్యము సానుకూలము గాదు. పాపము శమించుగాత. (నిష్క్రమించును)

2. వ రంగము.

[షావుకారు గృహము - బ్రాహ్మణవిందు]

(ప్రవేశం: వెంబన్న శర్మ, ఓబయ్య శాస్త్రి)

వెం— ఓహో పప్పుధప్పళానికి తయారైనావ్ ?

ఓబ— ఏమి ఆయనకేం, మహాశ్రీమంతుడు— మనషావుకారుగా రివ్యాళవిందు చేస్తుంటే ఏమోమనంరాక పోవటమేం పావలా డబ్బులు సంభావనైనా వస్తుందని వచ్చాను. నీవూ, అందు కేనా ?

వెం— ఏమో లే యింకా యింతవరకు మేమూ పనికి దిగలా,

ఓబ— లేదులే, యిలా వస్తేను అనుకున్నా- చేద స్తంముంటా వాడిని-

వెం— ఆ, లేదురా నేనేదో వ్యవహారం పనిమీద వస్తేనూ షావు

కారుగారు మరీమరీ బ్రతిమిలాడితే సరే భోంచేసి పోదామని వున్నాను.

ఓబ— సరే ఎలాఅయితేం భోజనానికి వుండాలు గదా. అయితే కూర్చో; వడ్డన వేళ ఐంది

రెం— ఓ, చాలాసేపైంది బ్రాహ్మణ్లు కావాల్సినవాళ్లు అన్నాకే అయిందీ.

ఓబ— అన్నీగో అంతా వస్తున్నారు ఆలస్యం లేదు.

(ప్రవేశింతురందరు బ్రాహ్మణులు మడికట్టుకొని, చెంబులతో —వారిలో కామ్మల చౌదరిగారు బ్రాహ్మణవేషమున జంధ్యముకగయి గాలు వేసికొని ప్రవేశించి ఓబయ్యశాస్త్రి పక్కన కూర్చొనును—(బ్రాహ్మణులందురు చౌదరీవైపు తేరి పారజూచుచున్నారు.)

కామ—(ముక్కు మూసికొని) కేశవా, నారాయణా, మాధవా, గోవిందా—(సంధ్యావందన మారంభించును.)

రెం—ఈయనెవరో నాకు కొత్తగావున్నదే. ఇదివరం చూచినట్లు గానేవున్నది (రహస్యముగా)

ఓబ—(చెవులో) ఆచౌదరిగారు గాదుగదా—

రెం—సరె, సరె తెలిసింది, తెలిసింది జ్ఞాపకం వచ్చింది. ఇకమీరు కంద్రగోళం చెయ్యకండి. (లేచి బయటికిపోవును.)

(ఓబయ్యశాస్త్రిగారు జరిగిజరిగి దూరముగా పోవును అందరు చౌదరివేపు మిట్లమిట్ల చూచుచున్నారు)

[విస్తళ్ళు వేయుదురు]

కామ—[భగవద్గీత తెరిచి పారాయణ చేయుచున్నారు.]

(పునః ప్రవేశం రెంబయ్యశర్మ; రావునాయుడు)

(రావునాయుడు చౌదరీప్రక్కన కూర్చొనును)

చౌద—(ఉలికిపడి) ఎవరు మీరు ?

రావు—మీరెవరు ?

చౌద—మేము కమ్మబ్రాహ్మణులం.

రావు—మేము భోగంబ్రాహ్మణులం.

చౌద—(మండిపడి) ఈ మీగోత్రం యెవర్రా నా బాపనాళ్ళు చెప్పిర్రా, నీకే పుట్టిందా ? ఏం యెవరనుకున్నావ్ ? (అని దూరముగా జరుగురు)

ఓబ—నువ్వేమని వచ్చావయ్యా బ్రాహ్మణహం కోసి ? భాగ్యముంటే సరి యనుకున్నావ్-చాలు చాలు లే షావుకారుగారితో చెప్పుదాం రండి.

( బ్రాహ్మలందరు లేచి )-బయటికి పదండయ్యా పదండి.

( ప్రవేశం షావుకారు )

షావు—అయ్యా, తొందర పడకండి, తొందరపడకండి, దయచేయండి.

చౌద—యేం తొందరయ్యా. నువ్వేమని పిల్చావ్ బ్రాహ్మలందరిని ?

షావు—అవును నేను బ్రాహ్మణ్యమును పిల్చినమాట వాస్తవమే.

చౌద—అవునూ. ఎవరు బ్రాహ్మణవృత్తిలో వుంటే వారే బ్రాహ్మణులు

రావు—నేనూ బ్రాహ్మణవృత్తిలోనే వున్నాను.

చౌద—చాలుచాలు లే పూటకో. పూరికే బ్రాహ్మణవృత్తిలో నున్నానంటే సరా; నదీ ఒక్కమాత్రం చెప్పు చూదాం-నీవు గాదూ యీ బ్రాహ్మలమని చెప్పుకొనేవారిలో నొకరిని సంధ్యావందనము సరిగా చెప్పమను చూతాము తెలుస్తుంది మజాఖా!

ఓబ—వస్తే మాకే రావాలిగాని, 14 జన్మాలు తన్నుకొన్నా మీకు వస్తుందయ్యా—వచ్చినా అది యొప్పుతుందా. స్వరయుక్తంగా వొక్కమాట చెప్పు తెలుస్తుంది నీగతి.

చౌ—తిరిగితే పట్టు రా, రా, పందెం వేసి మధ్యవర్తులను పలిపిస్తాం

శాం—సిద్ధాంతిగారూ, ముఖ్యవిషయ మిది. చౌదరీగారు మాతో కూర్చొని భోజనం చెయ్యాలటా: మళ్లీ మన రావునాయుడు గారు వారితో కూర్చోకూడదటా.

చౌద—(కోపముతో) ఆ, మేమే పోతాంలే, మీరే వుండండి ఎన్నాళ్ళు సాగించుకొంటారో చూతాం.

ధర్మ—అయ్యా, తొందరపడకండి. (చౌదరీవైపుచూచి)

క॥ ఏటికి మనలోపల పో
రాటము లీ స్వల్పవిషయమందున వినుడీ,
నేటికి యెప్పటినుండియు
కూటమితో మెలగలేదె కూడదె యిప్పుడున్ ।

ఉ॥ ఎక్కువతక్కువల్ దెలియ నీవిధి యెల్లరు పంక్తిభోజనం
బొక్కట జేసినంతనె ప్రయోజన ముండెనె? వారు మీరు నీ
చక్కని భారతాంబ వరసంతతి యంచు ప్రశుద్ధినమ్మి వా
రెక్కువ వీరు తక్కువని యెంచకయుండుటె శ్రేయమెప్పుడున్ ।

చౌద—

ఉ॥ వందలయేండ్లనుండి మము బ్రాహ్మణులెల్ల రణంగద్రొక్కి, వా
రందరు దైవతుల్యులని యగ్రకులంబున బుట్టినారలం
చున్ దలపోసి మమ్ముల నసూయత జూచుచు నేవగింపగా
యుండుటె చచ్చినట్టు? యిటులూరక బల్కెదవేల నీతులన్ ।

ధ—

ఉ॥ ఎందుకు విప్పిమీరు, నిటులెందుకు బ్రాహ్మణజాతిపైన నే
యుణ్ దగనట్టి యిందలకటా! పడవేసి తిరస్కరింప, మీ
యందరి కెట్టికోపములో యుట్టినె వారలయందుగూడ ను
న్నందుకు వారి నీకరణి న్యాయమె యూరక తిట్టిపోసినన్ ।

తే॥గీ॥ బ్రాహ్మణులు కన్యహారిణో పంక్తిభోజ
నంబు నొప్పమి దోషమునంగ దెలియు
గాని, నీవేల యట్లు భోగము గలుండ
టంచు సేవగించిరో యెఱింగింపుమయ్య॥

కావున నేను నీద్వారా బ్రాహ్మణేతర కతిపయుల కొక మనవి చేయుచున్నాను.

సీ॥ సంఘంబులో సమస్తకులంబులందు పూ
ర్వాచారములు కొన్ని పాతుకొనియె
ఏకులంబుల కేని యాకులాచారముల్
శాస్త్రీయ మనెడువిశ్వాస ముండు
వేదాదిగాక నూతనంబైనగాక యె
న్నో తెరంబులు వచ్చుచుండెనిట్లు
ఎన్ని జేయుచూసియు జేర్పగ చనో కట్టు
దిట్టముల్ చెడకయీమట్టునుండె
గీ॥ అట్టిపట్టుదలాచార మగుటజేసి
బ్రాహ్మణులెగాక నన్ని వర్ణముల వారు
వీడలేకుండ వెనకముందాడ వచ్చు
నన్యథాయెంచుటేల నన్యాయముగను॥

అయ్యా, బ్రాహ్మణేతరసోదరులారా!

తే॥ గీ॥ మీదు సంఘాభివృద్ధికి మిక్కుటముగ
శోధ్పడుడు గాని, బ్రాహ్మణదూషణంబు
వలన ఫలితంబు గలుగునే దలచుకొనియు
పాటుపడరయ్య సంఘసేవకు గడంగి॥

తే॥ గీ॥ బ్రాహ్మణులు మీరు నొకయభిప్రాయులగుచు
నిమ్నజాతుల రక్షింప నేర్పుతోడ

మెలఁగవలెఁగాని యీరీతి మీరుమీరు
మీస్వలాభంబునకు పోర మేలుగలదె?॥

అదియునుగాక,

ఉ॥ కాలముమారెనిప్పు గను కాటకమందు మునింగియుండె, నీ
వేళ సమస్తదేశములు స్వేచ్ఛగనుండగోన పోరుచుండె, నీ
కాలము పాడుచేసికొనగా సభలో మనమీవిధంబుగా
నేల కులాభిమానముల కింతగ పోరుట న్యాయమెంచుడీ॥

కం॥ సభలో మనమే పోరుట
గనుగొని యరులైనవారు కడు నవ్వరొకో!
జనదే మన మర్యాదయు,
వినుడీ వడి మీస్వదేశవృద్ధిని గనుడీ॥

చౌద—అయ్యా, మీరెన్ని చెప్పినను సరే గాని, బ్రాహ్మణద్వేషము దేశమున మేము సర్వాధికారులమగువరకును మాయందుండ వలసినదే. ఇన్నాళ్లెట్లున్నను ఇంకను మేము బ్రాహ్మణుల మాయలలో బడిపోమని త్రికరణశుద్ధిగా నమ్ముడు.—

ఉ॥ టక్కరులైనవారె, కపటాంబికులైనవారె దేశమం
దెక్కడ జూడవారె, మరియేపనులందునువారె, భూమిలో
నెక్కడలేని ఘోరములనేనియు సేయగవారె, యక్కటా!
యిక్కలికాలబ్రాహ్మణుల కెన్నడు చేటులభించునోగదా?

గీ॥ మొదట బ్రాహ్మణకులము నిర్మూలమైన
గాని దేశంబునకు క్షేమకరముగాదు;
దీపముండంగనే పనిదీర్పవలయు [illegible]
ననువిధంబున మా సమయంబునిదియె॥

ధర్మ—మిత్రమా, నీమాటలు నాకు హృదయవేదనను గలిగించుచున్నవి.

( తనలో )

ఉ॥ రోజులు పోయిరోజులాయె రోజుకు రోజు ప్రపంచమందు శ్రే
ష్ఠా! జనులెల్ల దుర్నయములయందు మునింగి చరించుచుండ, నీ
రీ జగడంబులందుఁ బడి యిట్లొక రొక్కము కోర, నెట్టులో
నై జగుణంబు; దానికి మనంబున నచ్చెరువొంద పోదునే॥

హిత్రమా,

గీ॥ ఒక్క బ్రాహ్మణు లననేల? నిక్కముగను
ప్రబల దుర్మార్గు లన్నివర్ణములయందు
బయలుదేరిరి కలికాలమహిమవలన
బ్రాహ్మణుల నేల ప్రత్యేకపరతురయ్య॥

ఉ॥ జ్ఞానమునందు, సర్వవిధసంపదలందు, వివేకవంతులై
మానవశ్రేష్ఠులంచు గడుమాన్యత నొంది ప్రసిద్ధిగన్నవం
శానికి చేటు నెంచుట విషాదకరంబు ననర్థకంబలం
చేనియు లోదలంచ కిటువింత యసూయత జూడపాడియే॥

తే॥ గీ॥ వారివలె మీరు నధికార వాంఛ
యెట్లు దూషించుచున్నా రదేటి నీతి?
భరిత సంఘాభివృద్ధి గావలయునేని,
వారు మీరేకమగుడు సంస్కారమునకు॥

సోదరా,

ఆగ్రహచిత్తుడవైయున్న నీ కీమాటలిప్పుడు చెవిదూరకపోయినను తదుపరి శాంతచిత్తముతో నామనవి యాలోచించిన నీబుద్ధిని నీవే మరల్చుకొందువు. కావున మీరును వారును గలసిమెలసి సంఘసంస్కారమునకు తోడ్పడవలెగాని, మీలోమీరు కలహించు టనర్థదాయకంబని త్రిశుద్ధిగా నమ్ముడు. ఇంతకన్న మీకెక్కువగా జెప్పుట కేమియు లేదు.

ఓ బ్రాహ్మణ సోదరులారా, మీకు నే నేమిచెప్పవలయును?

క॥ సకలము దెలిసినవారికి
యొక రెవ్వరు బుద్ధిఁజెప్ప? యోగ్యతమీరే
యొకరికి జెప్పెడువారలు,
యకటా! మీ కొరులు జెప్ప యావశ్యక మే?॥

సీ॥ మాటచే మీవారు మహిమ లెన్నియొ జూపి
జగములన్నిటినేలు జ్ఞానపరులు
పలుకుచే మీవారు బలవిరోధుల నైన
తమ కాళ్ళ పట్టించు దార్ఢ్యమతులు
తపముచే మీవారు దైత్యారులనుగూడ
గడగడలాడించు పిడుగులౌర!
త్యాగశీలమున సార్థకమైన మీవారు
సురలపూజలుగొన్న పరమఘనులు

తే॥ గీ॥ సత్యశౌచాది సద్గుణశాలులగుచు
ధర్మ సంస్థాపనార్థ మిద్ధర జనించి
పేరుగొన్నట్టి వారు మీవారలెల్ల
వారిపఖ్యాతి నిలుపుకో వలయుమీరు॥

సీ॥ మీ కులాచారముల్ సాకల్యముగ మీరు
నెరవేర్చుకొనుడు మీ నేర్పుకొలది
మీ నిత్యకర్మలు సానుకూలంబుగా
సాగించుకొనుడు మీ శక్తికొలది
మీ వేదపఠనంబు సావకాశంబుగా
నభ్యసింపుడిక దార్ఢ్యము కొలంది
మీ తపోమహిమను ప్రీతితో నెంతైన
వృద్ధిగావింపుడీ బుద్ధికొలది

తే. గీ. ఇట్టిసర్వోత్తమంబైన నెల్ల విడిచి
తుచ్ఛసేవకావృత్తికై యిచ్ఛ జేసి
త్రొక్కుచుండుటల యింక నిప్పట్టు మీరు
స్వార్థమతి నీడి, వర్ణసన్యాసులు గందు ॥

మరియు,—

తే. గీ. కాలమానపరిస్థితుల్ గాంచకుండ
మెలగ దగదంచు యోగ్యత దెలిసి మీరు
కొన్ని యాచారపద్ధతులున్న యెడల
మార్చుకొనవలయు నుదారభావులగుచు ॥

ఆశలుడుగుటకొక్కటి దురాగ్రహము లేకయుండుటకొక్కటా
వేశము లేకయుండుటయు, శ్రీమజ్జనంబుల జూచుచుంటయున్
లేశముగూడ గర్వమతి లేక మెలంగుట, భక్తితోడ స
ర్వేశు భజించుచుండుటయు నెల్లపుడున్ భవదీయ ధర్మముల్ ॥

బ్రాహ్మణసోదరులారా, మీకింతకన్న చెప్పవలసిన దేమియును లేదు. మీ ప్రస్తుత వివాదాంశమగు పంక్తిభోజనవిషయము ప్రాముఖ్యమైనది గానే గాదు. ఎవరి యాచారముల ననుసరించి వారు భుజించుచుందురు. వారును మీరును ఇష్టపడుచో కలిసి భుజింపుడు. లేదేని మీ మీ పద్ధతుల ననుసరించి వేర్వేర భుజించుడు. అది యొక ముఖ్యవిషయము గానే గాదు. కాని మీరెల్ల రైకమత్యముతో సరిసమానముగా నుండి, సంఘసేవ యొనర్చుట యే యత్యంతావసరము. మీకాల మంతవృథాపుచ్చి ప్రసంగించినందుకు క్షమింతురుగాక.

(నిష్క్రమింతురు)

(తెరపడును.)

## 3 వ రంగము.

( ప్రవేశము ఆచారసిద్ధాంతి. )

ఆచా—అమ్మాయ్, రాజమ్మా,

( తెరలో, ఓయ్ )

ఇటురా,

( ప్రవేశం ౧, రాజమ్మ )

అయితే పొద్దున నీళ్ళకుపోయి వస్తుంటే యెవరూ నీతో మా ట్లాడిరన్నావ్?

రాజ—ఆయన పేరడగలేదుగాని, యివతలకు వచ్చిన తరువాత యెవరో అన్నారు; ఆయన ధర్మసిద్ధాంతిగా. అబ్బెబ్బే మరీ యనా యం, అన్నాయ్యా, మాలవాడిని ఆయుకునే నుంచున్నాడ బొత్తుగా.

ఆచా—ఓహో, ఈయనా, యీమధ్య విన్నాలే, ఆయన చాల చదువుకొన్నవాడట. ఇంగ్లీషులో యం. ఎ., ప్యాసయి, యుద్యోగానికి పోకుండా సంఘసంస్కారానికి పాటుప తున్నాడట. అయితే, యేమన్నాడాయన?

రాజ— ఏమనేదేమిటి? నేనింకా నూతిగాణ్ని కూక లేస్తాడేమో ననుకున్నా- వాడూ మనమోస్తరుగానే మనిషిటా, దారి పోతున్నాడట- తప్పేంలేదట-

ఆచా— ఆయన సంస్కృతం గూడా చదువుకున్నాడు- చాలా తెలి సిన వాడన్నారే! చివరకిలా దిగా జేంఖర్మం

రాజ— ఎంతచదువు కుంటేయేం, రాత- వర్ణసంకరం అయిపో రోజులువచ్చాయి- మతంపాడయి పోతున్నది.

ఆచా— ఇంకేమన్నాడూ?

రాజ— ఇంకేముంది; మీతో మాట్లాడాలి వస్తానన్నాడు- వస్తా మో బహుశాయిప్పుడు; ముక్కచివాట్లు పెట్టి పంపించు.

ధా— అలాగా, సరే నీవు వెళ్ళు- అయితే యివ్వాళ మనకు శనివారం గామోలునే, ఒకమానెడు బియ్యం పిండి విసిరించి యింతఫలహారం చెయ్యి మాకటికి.

రాజ— అలాగే లెండి- నిన్న వాళ్ళు పంపించిన ఒకపాతిక అరటి పండ్లు గూడాయున్నవిలే వాటికితోడు మానెడో అడ్డెడో బియ్యం విసిరిస్తే ఫలహారానికి సరిపోతాయి:

ధా— సరే పో,

(రాజమ్మ నిష్క్రమించును)

సీ॥ అకటా, రోజులు పాడురోజులయి బ్రాహ్మణ్యంబె క్షీణింప లౌకికసంబంధము లెక్కువయ్యె, హరిభక్తిజాతమా గానరాదాకరవ్వంతయు, నిత్యకర్మలనలెండెబోయె, మానుష్య సేవకుగా నేడుదరంపుసేవయొకటే ప్రాబల్యమయ్యెగదా॥

కలికాలమునుగూర్చి పూర్వమెన్ని యక్షరాలు వ్రాసిరో యా యక్షరములు నేడు జరుగుచున్నవి!

మ॥ కలికాలంపు మహాత్మ్యమేమనియొయెటన్గాన్న పాపంబె యీయిల వ్యాపించెను, జీవహింసయొచటన్ హెచ్చయ్యె, సద్ధర్మముల్ కులధర్మంబులు జాతిధర్మము హ్రాశోత్కర్షంబులన్ పీడ, మాయలుమెండయ్యె, నధర్మముల్ పెరిగె నన్యాయంబు వ్యాపింపగా॥

ఇక ప్రపంచమునందు సామాన్యస్థితిని జూతమన్నచో

సీ॥ ఒకరి సౌభాగ్యంబు నొకరు జూచి సహింప
రొకరి గొప్పను జూచి యీర్ష్యరొకరు,
ఒకరియాధిక్యంబు నొక రొప్పుకొనరెల్ల
ప్రాణు లొక్కటిగా దలంప రొకరు
ఎవరి ధర్మము వార లెప్పు డాచరింప ర
న్యుల తప్పు లెప్పుడెంచుచుందు రొకరు

ఒకడు పోయినదారి నొకడేగ నొల్లడం
దరు తనదారి రాఁ దలచు నొకడు
గీ॥ "ఏటి కొకడీడ్వ నేటికి యీడ్చునొకడు"
ధర్మశాస్త్ర పురాణముల్ తారుమారు
గాగ, వింతసిద్ధాంతముల్ లాగునొకడు,
కటకటా! కాలమా! యెట్టిగతి ఘటిల్లె!॥

ఓహో! ఎవరో వచ్చుచున్నారు!

(ప్రవేశం ధర్మసిద్ధాంతి)

ధర్మ—నమోనమః (నమస్కరించును)

ఆచా—శ్రీకృష్ణార్పణమస్తు: నమోనమః. దయచేయండి. తమ దే గ్రామం?

ధర్మ—అయ్యా, నేను ప్రస్తుత మీ గ్రామమునకే వచ్చియున్నాను. నేనొక సంఘసేవకుడను. తమ దర్శనము చాల రోజులనుండి యపేక్షించుచుండ నేటికి లభించినది.

ఆచా—ఓహో! ధర్మసిద్ధాంతిగారు తమరేనా? దయచేయండి దయచేయండి. నేడు చాలా సుదినం. తమను గురించి విన్న నప్పటినుండియు తమను దర్శింపవలెనని నేనును కుతూహలముతో నున్నాను.

ధర్మ—ప్రస్తుతము మన దేశస్థితినిగూర్చి తమ యభిప్రాయమేమి?

ఆచా—ఏమున్నది. మతం, కులం ఆచారం పాడయి పోవుచున్నట్లు మాత్రము స్పష్టమగుచున్నది.

ధర్మ—మతమెట్లు పాడగుచున్నదని తమ యభిప్రాయము?

ఆచా—వర్ణ సంకరమై పూర్వాచారములు నశించుటవల్ల.

ధర్మ—మరియొక విధముగా మతము పాడగుటయేగాక, నశింపుగూడ సంభవించుచున్నది.

తే॥ గీ॥ మతములందున హైందవమత మటెన్న
యనుచు మురుసుకొని మురోజు లంతరింప,
సంఘమును బాసి పెక్కు కష్టములు పడెడు
మాలమాదుగ కులములఁ జాలమంది
క్రైస్తవ మతంబులోఁ జేర గడగి రకట!

ఆధా— వారికేన మతమేముండును? ఉన్నను ఛండాలులగు వారు పోయిన మాత్రమున హిందూ మతమున కేమియులోటు గలుగునని తోచదు.

ధర్మ— అయ్యా, అట్లనకుడు,-

తే॥ గీ॥ వారు గూడను మనతోటివారు భరత
భూమిలో బుట్టలేదె హిందూ మతమున?
అట్టివారిని ఛండాలులని దలంచి
మతములోనుండి తరుమ క్షేమంబె మనకు?

మనమతస్థులై మనచే బాధలు పడలేక నన్యమతమున స్వీకరించుట మనకును మనమతమునకుగూడ కళంకము గాదా?

ఆధా— వారి కులధర్మములు వారికుండ వారినెవ్వ రన్యమతమును స్వీకరింపమనిరి? వారిని మనమెన్నడు తరిమినవారము కాజాలము. వారికై పవిత్రవంతమగు మన మతమునుగూడ పాడుజేసికొందుమా?

ధర్మ— అయ్యో,

సీ॥ పంచములంటవారును ప్రపంచమునందు మనుష్యులంట, నే
డెంచగవారి నంటుకొనుటే గడుపాతకమంట, చూరిలో
నుంచగరానివారట, సహోదర హిందువులంచు నెంచకే
తంచనజేయు గాడిదల, పందులకన్నను నీచమైరొకో॥

మరియు,—

చ॥ పలుగురితోటిపాటుగ జనంబులతో గలయంగరాదు, వీ
థుల నడువంగ గ్రామమున దోషము, గ్రామబావులన్
జలమును తాకరాదు, పరిసంఘములో సముగ్గైనపెట్ట రా
దిల నిటువంటిఘోరము సహించు మతంబు పవిత్రవంతమే॥

ఆచా—

తే॥ గీ॥ కులము జాతియా గొడ్డనుకోయు కులము
వృత్తిబాడ తోళ్ళను నోట పీకువృత్తి,
తినుటకా, చచ్చినమాంసభక్షణమె తిండి,
అట్టి ఛండాలు లర్హులే యాదరింప ॥

మరియు,

మ॥ ఒకరోజా? పదిరోజులా? మరియు నెన్నోయేండ్లు? యిట్లు, గతిం
చె కసీనంబు యుగమ్ములెన్నో; యికనేనిన్ సాగదే యిట్లు? నే
టికి హిందూమత సాంప్రదాయముల పాటింపంగ భారంబె? యెం
దుకు సంస్కారములన్న పేరున మతద్రోహంబు గావించుటల్ ॥

ధర్మ—కటకటా, యెట్టి కఠినవాక్కులు బల్కితిరి !

ఆచా—మరియొక విషయముగూడ నాలకించుడు.

తే॥ గీ॥ వేదశాస్త్ర పురాణముల్ వేయియేల
పూర్వచారిత్రమెల్ల సంపూర్ణముగను
నీచ ఛండాలపుల్క నిమ్నజాతు
లున్నవని సేయుఘోషలు సున్నయగునె ?

ధర్మ—అయ్యా, తమ ధోరణివలన నాకు మూడు విషయములు స్పష్టమగుచున్నవి. పంచముల బహిష్కరణ మనాదినుండి వచ్చు పూర్వాచారమనియు, వారి కులవృత్తులు నీచగర్హ్యములనియు, మన వేదశాస్త్రపురాణములు మనచర్యను సమర్థించుచున్నవనియు తాము సెలవిచ్చితిరి. మొట్టమొదట యాచార విషయమించుక యోచింపుము.

సీ॥ ఆచారములలో సదాచారములు దురా
చారంబులును గూడ శాశ్వతంబె
మనలోనె సహగమన మాతృహత్యయు
నరబలి శిశుహత్య లెరుగ మొకొ ?
అవి సనాతనమైన యాచారములె యైన
దొలగించు కొనలేదె దోషమనుచు,
మును పెట్టుకున్న నిప్పుడు పంచముల బహి
ష్కరణంబు కీడయ్యె సంఘమునకు
గీ॥ జాతిలో నైకమత్యముం జంపుచుండ,
మనము క్షీణింపసాగె క్రమంబుగాను
సోదరజనంబె కడగండ్ల నుర్కుచుండ
ఘోర ! యాచార మికనైన మారవలదె !

ఆ విషయ మట్లుండ,

మ॥ హరిసృష్టించిన సర్వమానవుల కే హక్కుల్ ప్రసాదంబులో
ధర నా హక్కులె యెల్లవారికి సమత్వంబొప్ప వర్తింపగా
బరులెవ్వా రరికట్టెయాపుటకు నెవ్వారైన లోకంబులో
నరులై బుట్టి నరప్రపంచముననుండక్ నోచుకోకుందు రే॥

ఆచారవిషయమిట్లుండ, వారికులవృత్తి నీచమును విచారింతము.

తే॥ గీ॥ నిజముగా కాలవశమున నీచవృత్తి
వారికలవడె బో, తోటివారమైన
మనము వారిని సంస్కరింపంగవలయు
గాని, యేవగించుట న్యాయమగునె దలప! ॥

మొట్టమొదట వారికీవృత్తి యెట్లుపట్టువడెననుు, ప్రస్తుతస్థితి నించుక
మవింతము,

ఉ॥ అందరితోటిపాటు గమహోయిగ నేదొకకూలినాలి జే
యుందగునన్న దగ్గరకునైనను వారిని జేరనీయ మె
ట్లుందురికేమిసేయుదు? రయోమయమౌదుమునింగి యెదో వృ
త్తిం దమపొట్టఁబోసికొను దీనులుగారె దలంప పంచముల్॥

తే॥ గీ॥ నీచఘండాలురని యెంచి నిఖిలజనులు
పురములందుండి వారిని తరిమి వేయ
జ్ఞానమెటులగల్గు పెక్కుకష్టములఁగుందు
వారికులనీచమెంచుట కేరితప్పు?

ఉ॥ ఎన్నఁడుగాని వారికడ కేగయినన్ జనిబోధజేసిన
ట్లున్నదె జ్ఞానమెంతయిన? నూరక వారిని చెప్పరానివా
రన్న యసూయతోడ పరిహాసములాడుచు వారిజాతి నీ
డన్నగ నీచమంచు మనమేటికి బల్కుట సిగ్గులేకిలన్॥

ఇక వేదశాస్త్ర పురాణముల విషయము చాల బలవంతమైనది.
ఈవిషయమున యభిప్రాయభేదముగూడ చాలనున్నది.

తే॥ గీ॥ ఘోరసాంద్రంబులైన నెవ్వారికైన
వేయు రకరకంబుల మత్స్యములులభించు
నట్లపార హిందూమతమందు వెదుక
నేరి సిద్ధాంతములకు నాధారముండు॥

ఇక మన వేదముల స్థితి యెట్లున్నదనిన,—

సీ॥ బాల్యవివాహముల్ పరమహితంబంచు
దలపఁగ వేదశాస్త్రములె సాక్షి
అలవితంతు వివాహ మాసరమను వారి
కా వేదశాస్త్రాలెయగును సాక్షి
వర్ణభేదము లెంచ వర్ణభేదము లార్ప
వేదశాస్త్రములె భావింప సాక్షి
ఏరెండుపక్షంబు లేనివాదించు వా
రికి వేదశాస్త్రంబు లోకమునసాక్షి,

గీ॥ అంతమాత్రాన విలువకానంతబోక
హైందవమతంబు బాహాబాహ్యమై విశాల
హృదయమును జూపుచున్నది, యెప్పుడెట్లు
మెలగవలెనో యథావిధి మెలగుకొరకు॥

అదియునుగాక,

॥ ఏమతమైనగాని మరియే హితమైనను నీచపూర్వులఁ
క్షేమముగాంచ బాగుపడజేతురు గానియు, నెప్పుడిట్లు ని
ర్ధ్యామిస్థిరంబు జేయుటకు ముట్టకనంటక వారిపట్ల నీ
ర్వ్యామతిఁజూపి సంఘమున కావలనుంచ ననుజ్ఞనిచ్చునే?॥

కావున మన వేద శాస్త్రము లెన్నటికిని మనము జేయు నుత్తమ కా
ర్యముల కాటంకము గలిగింపవు. తుదకు నేను జేయుమనవి యేమనగా,

చ॥ మనుజులలోన కొందరికి మైల విధించి బహిష్కరింప నే
మనుజులకైన కళంక మవమాన మమానుషమున్ చెలంగి పే
మ నిఖల మానవాళిని సమానతఁజూచి మనుష్యజన్మఁ బా
వనమొనరింపరయ్య మనభారతదేశయశంబు దక్కగన్

ఆచా— అయ్యా మీరు చెప్పువిషయము లెంతసమంజసముగా నున్న
ను పంచముల పట్ల దృష్టిమార్చుకొనుట దుస్సాధ్యమని నాయ
భిప్రాయము. ప్రపంచము పుట్టగా పుట్టిన యాచారమిప్పుడు
పొమ్మనిన పోవునా ?

ధర్మ— అవును తమరు చెప్పిన విషయము వాస్తవమే,

తే॥ గీ॥ చాలకాలమునాటి యాచారమగుచు
పాతుకొనియుండెననుమాట వాస్తవంబె
గాని, విద్యాధికులు క్రమక్రమముగాను
దృక్పథము మార్చి వ్యాపించు దేశమెల్ల॥

కావున తమవంటివారు సంస్కారమునకు గడంగవలెనని నా కోరిక.

ఆదా—కానియ్యండి. మనము జేసెడి దేమున్నది. మీరు జెప్పినట్లు వార తమ నీచవృత్తిని మాని సంఘములో చేరనర్హులైనప్పటి గదా—

తే॥ గీ॥ వారికులవృత్తినీచమై వారలెల్ల
హేయముగ జీవనము సేయుచుట్టి వేళ
మనమె కులభ్రష్టులముగాగ వారిఁ
గౌగలించుకొను టవివేకంబుగాదె॥

అయ్యా, తొందరపడి, పవిత్రవంతమై యగ్రమతంబైన హిందూమతమును సంకరముసేయుటకు గడంగుట వినాశకరము.

ధర్మ—అయ్యా, తమరు సరిగా ప్రస్తుతస్థితి నరయుటలేదని నేనూహించెదను. క్రిస్టియన్ మిషనరీ వారి ప్రబోధమువలనను, మనలో ఆర్యసమాజము, బ్రహ్మసమాజము. దివ్యజ్ఞాన సమాజము మున్నగు సంస్కార సమాజముల ప్రయత్నములవలనను, శక్తిమంతులగు సంస్కారకర్తలు నిమ్నజాత్యుద్ధరణకై గావించు పలు ప్రయత్నముల వలనను, పంచమజాతిలోగూడ నిప్పుడు చాల వరకు విజ్ఞానముగలిగినది. వారు మునుపటివలె నిప్పుడు క్రిస్టియన్ మతములో కలియుటకు పరుగులు పెట్టక, తమ సనాతన హిందూమతములోనేయుండి, తమస్థితిని బాగుచేసికొనుట కుయత్నించుచున్నారు. వారిలో చాలమంది జ్ఞానవంతులు విద్యావంతులు బయలుదేరిరి. వారునీచవృత్తిని చాలవరకు మానుచున్నారు. క్రిస్టియను మతములోనిదివరకు తెలియక కలిసిన వారు మరల హిందూమతములోనికి వచ్చుటకు తపించుచున్నారు. కావున యీసమయమున మనము వారికి యుత్సాహమొసగవలయును.

ప్ర— వారికిట్టిసాయము చేయుటకును మనకభ్యంతరముండకూడదు గాని, యెంతయాలోచించినను మతాచారము మానుటకు మాత్రము మనస్సంగీకరించుట లేదు.

— సావకాశముగా నాలోచించిన తమరేయందలి యావశ్యకతను గుర్తింపగలరని నానమ్మకము. పంచముల విషయమిట్లుండ హిందూసంఘముయొక్క స్థితియే చాలగందరగోళముగ నున్నది.

మనదేశమున నన్ని మతముల హిందూ మ
తము సనాతనమాట తథ్యమగును,
అంతమహమ్మదీయమతంబు క్రైస్తవ
మతము లేతెంచె క్రమంబుగాను,
హైందవమతము పందంతులేకయె శాఖ
లుపశాఖలకులంబు లుద్భవించె
మతవైరములు జాతిమాత్సర్యములు, చాల
కులశాఖభేదముల్ గలిగెనంత,

తే॥ గీ॥ కడు లెగబ్రాకుచుండె సంఘమున, పూర్వ
పక్షమైపోయె ధర్మసంబంధమెల్ల,
న్యాయసత్యంబు లవలె స్వాంతములవీడె,
కటకటా! యైకమత్య మంతట నశించె!

ప్ర—అవును. ఈవిషయములన్నియు వాస్తవమేగాని క్రమముగా పాపము నశించి ధర్మము పునరోద్ధారణయగును. పవిత్రవంతమైన బ్రాహ్మణజాతి మరల పూర్వపు యౌన్నత్యమును బడసినగాని దేశమునందలి యనర్థకములు తొలగవు.

—ప్రస్తుతము బ్రాహ్మణజాతిపై ప్రబల ద్వేషమేర్పడియున్నది.

—ఇంతవరకే యుగమందెప్పుడైనను బ్రహ్మద్వేషము వలననే మహాసంహారము సంభవించుచున్నది.

ధర్మ—అట్లనుటవలన, బ్రాహ్మణులు నిర్దోషులని జెప్ప నేనంగీకరింత[illegible] బ్రహ్మద్వేషమునకు కారణము బ్రాహ్మణులయందున బ్రాహ్మణేతరులందునుగూడ నున్నది. యెట్లనిః—

ఆ। వె। బ్రాహ్మణులకు పెక్కు వ్యాసంగములు హెచ్చి
మీరిపోయె నాళ్ళ వారియందు
యెచటగాంతమన్న నేనీచమునకైన
బ్రాహ్మణుండె సిద్ధపడియెనకట!

ఇంక బ్రాహ్మణేతరులగువారు,—

ఆ। వె। పరులమాయలందుపడిపోయి కొందరు
నోర్వలేమి కొందరున్నవారు
తుచ్ఛపదవులందు నిచ్ఛ[illegible] కొందరు
బ్రాహ్మణులను తిట్టువారుగలరు!

కేవలము వీరేగాక నిశ్చయముగా కొందరి బ్రాహ్మణుల దుర[illegible] గతంబులవలన యన్యాయాపేరితులయిన బ్రాహ్మణేతరులునుగూ[illegible] గలరు.

ఆచా—ఇవియన్నియు నిశ్చయమే గావచ్చును గాని, దీనినిబట్టి మీ[illegible] ముఖ్యాభిప్రాయమేమి?

ధర్మ—యేమున్నది. హిందూమతసంఘము చాల తారుమారైయున్న[illegible] దనియు, పునర్నిర్మాణము గావింపబడవలెననియు నేను [illegible] చెదను.

ఆచా— మనమిప్పుడు క్రొత్తగా జేయుట కేమున్నది. మతములన్ని[illegible] యుత్తమమై సర్వతాప్రపూజనీయమైన హిందూమతసనా[illegible] పద్ధతులు పట్టుదలతో నెలకొల్పుటయే కర్తవ్యము.

ధర్మ— అయ్యా, మీరుహిందూమతపూజ్యతను గురించి ముచ్చటిం[illegible] నాకు స్ఫురించినది. దక్షిణాఫ్రికాలో హైందవులను ము[illegible]

ముగా హిందూమతస్థులను బెట్టు నగచాట్లు కష్టపురంపపు కోత కోయునట్లు దినదినము వార్తాపత్రికలద్వారా నే తెంచుచున్నవి.

ఆచా— ఆ- ఏమది- హిందూమతస్థుల కగచాట్లా?

ధర్మ—కేవలమగచాట్లు మాత్రమేగాక, అవమానపరచుట హింసించుట- నీచజంతువులకన్న హీనముగాజూచుట.

ఆచా— ఇవియన్నియు హిందువులకే!

ధర్మ— ముమ్మాటికి హిందువులకే? అందును కడజాతియుగ్రజాతియను విచక్షణలేక హైందవులందరిని నీచజాతిసలమాడ్కి జూచి తెల్లవారు తమకూడిగమును జేయించుకొనుచున్నారట?

ఆచా—ఎంతవిపరీతము!

మ॥ అకటా! హైందవులిట్టి దుస్థితికి పాలైరంచు విన్పింప నా
కాక యావేశముబుట్టి, భూమికిక నేదోయొక్క పెన్మోవ గ
ల్గక పోదంచు మదిన్ స్ఫురించెడును, లోకంబందు హిందూమతం
బకలంకంబయి శాశ్వతంబుగను గొప్పైయుండనాటంకమే!

కటకటా! పాపము శమించుగాత, ఇంకనచ్చటి విశేషములేమి?

ధర్మ—అయ్యా, ఇంకను, చెప్పుటకేమున్నది. వారిస్థితి కనులారజూచి తీరవలెగాని చెప్పనలవిగానట్లున్నదని తెలియుచున్నది.

ఆచా—మనమచ్చటికిబోవు నుపాయమేదైన గలదా?

ధర్మ—ఎట్లైననువెళ్ళి చూచిరావలెనని నాకును కుతూహలముగా నున్నది. తమరుగూడ బయలుదేరుచో నిశ్చయముగా వెంటనే బయలుదేరుదము.

ఆచా—అంతకన్న మనకింక విధియేమున్నది, మతసంరక్షణకన్న మించినధర్మము మనకింకొకటియుండదు. అదిగాక మాకడసారి సాహాదరుడు శంకరశాస్త్రి నిరుడు ఇంట్లోకోపమువచ్చి ఆదేశమే వెళ్ళినాడట ఇంతవరకు వాడిజాడా తెలియుటలేదు.

మనము స్వయముగా పోయి నాలుగు కూరలేసి తీసుకురావల నని యున్నది. కావున యేమేమి యేర్పాటులు కావలయునో దెలిపినయెడల త్వరలో సిద్ధమయి పయనమగుదుము.

ధర్మ—ఏర్పాటులేమున్నవి? తమరు సిద్ధపరులగుటచే భోజనవసతి విషయమే కొంచెము సంకోచముగా నున్నవి. సరే, సముద్ర యానమందరు చేయుననేయున్నారు.

ఆదా—దానికేమున్నది. మా చెల్లెలు రాజమ్మను గూడ తీసుకొనివచ్చె దను. అది దేశమంతా చూడవలెనంటున్నది. మనకు నానా కూళ్లు తినకుండా యింత యుడకవేసి పడవేస్తుంది. యెలాగో వచ్చినతరువాత కఠినప్రాయశ్చిత్తం తప్పదు.

ధర్మ—అలాఅయితే, మనప్రయాణం దివ్యంగా సాగుతుంది. తమ సొంతపనిగూడ కలిసివస్తుంది. బయలుదేరండీ, నేనూ సిద్ధమై వస్తాను. (నిష్క్రమించును)






పంచమాంకము.

1-వ రంగము.

(ప్రవేశము జగన్మాత)

కీర్తన-నటభైరవి ఆదితాళం.

(రామా, రామా, రామా దేలా మోస్తరు.)

దేవా—దేవా—బ్రోవ—రావా
నీవే—నాకూ—దిక్కూ—గానా॥

1 నీవులేనిచో నే నొకక్షణమును, నిలువలేనుగాదా,
నీతో మొదలనలేదా, నిఖిలజగములను సుఖమున
గనుగొన నిన్ననమ్మితినిగాదా ॥దేవా॥

2 కన్నా—తండ్రీ—జ్ఞప్తి—లేదా
విన్నా—వించూ—కొంటి—గాదా,
మున్నే నీ పద। ముల నమ్మితినని। మొరపెట్టితి చాలా।
హరి, మరువగనేలా। అనుదినమును వినయమునను
మనముననిను గనుదానా ॥దేవా॥

3 కోరా తండ్రీ - యాదీ—దేవా
కూర్రా-మేలా రావా—బ్రోవా
శరవచ్చి నాచింతలు దీర్పుము

శరణంటినిగాదా నీతనయను నేగాదా
కనికరము ననుగనుగొనుటకు నిను గడు వేడితిగాదా। దేవా।

(4) స్వామీ—కారా—బ్రహ్మ-దేవా
భూమీ—నెల్లా—నేడూ—గావా
పుడమిపాపమును కడతేర్పగమును పడిగనటుగ లేదా
నీ కిపుడు కరుణరాదా
గడబిడ తెగయగ వడివడి కడుచెడు నరులనుగావలేదా। దేవా।

వ॥ స్వామిరో, సృష్టి జేయుటన బాధ్యతదప్పినయట్లు నీవున న్నేమఱచియున్న వాడవౌకా ! యెంతో విషాదపరిస్థితు లేర్పడంగన నేమి యొనర్చుదాన నిక యేవిధిజూచి భరించుదాన నీ నామము సంస్మరించుటయె నావిధి, వేగననుగ్రహింపవే।

తే॥ గీ॥ జీవులందున నరజాతి శ్రేష్టమనుచు,
వారిభారంబు నామీదఁబడదటంచు
నమ్మియున్నట్టి నాదుమనంబు నేడు
తారుమారయి చింతలోఁ దగిలెనకట॥

సీ॥ ఎందుఁజూచినగాని యాందోళనలు హెచ్చి
ఘోరయుద్ధంబుల ఘోషబుట్టె
ఎచటఁజూచినగాని యెల్ల జాతులలో
పరస్పరవైరముల్ రగులుచుండె
ఏవాడనరసిన దైవభక్తి నశించి
పాపమెల్లడలను ప్రబలుచుండె
ఎచ్చోటగాంచిన యిల ధర్మమునశించి
రాక్షసత్వం బెగఁ బ్రాకుచుండె॥

గీ॥ న్యాయమునశించి పెరిగె నన్యాయమవని
పాపమభివృద్ధియై యమకూపమయ్యె

ధాత్రిఁ జొల్లను; ధర్మసంస్థాపనార్థ
మింకనైనను శ్రీహరీ, యేలరావా!

॥ ధరియింపంగ నశక్తురాల నిక యీపాపంబు సర్వేశ్వరా
పరులే మాధర్మ్యగంబులైరి, యిలకీనాఁడ్యంబయ్యె పుణ్యంబు, తే
దరవీసంబును చిత్తశాంతి, తలక్రిందయ్యెఁ బ్రపంచంబు, శ్రీ
హరి, నీవేగతి వేగ రాగదవె యీయాలస్య మింకేటికిన్

తే॥ గీ॥ నారు వ్రాసిన యాతఁడే నీరు వ్రాయు
ననుచు ధైర్యంబు జెప్పితివయ్య నాకు
ఇంతభారంబు నెత్తిపై కెత్తుకొంటి
తండ్రి, ననుగావరా వేటి ధర్మమయ్య!

రాగం- కాఫీ- రూపకతాళం

పర- మేశా- యాదిదేవా- రావె ననుగావంగా
పరమకరుణా- వరములొసగ భారమగునె తండ్రి- హరీ ॥పర॥
ఇంతగనీకయి నే- సంతతముగ- వేచియుండఁగ
స్వాంతమందింతయు, నోస్వామిరో ! ప్రేమయు లేదా ।
పంతమొదీనుల- చెంతకు జేరవె
సంతసమాయెనా॥ పర ।

(ధ్యానము నభినయించును)

(హస్తాంజలి పుష్పములు రాలును)

ధన్యోస్మి, ధన్యోస్మి.

ప్రవేశము అతిబ్రహ్మ.

క॥ వందనము దేవ నీకును
వందనమో కన్నతండ్రి, వందనమయ్యా

క్రీస్తు మహమ్మదు జ్ఞానబుద్ధుం డాది
యవతారములు ధర్మమాపినాడ
అలపాపమాధిక్య మెప్పుడౌనో యప్పుడె నే
నుద్భవించుచునుందు నుర్విలోన
తే॥గీ॥ హింస, పానంబు, వైరము, హెచ్చు జాతి
వర్ణసంకరమవని సంపూర్ణముగను
నాశ మొనరింప భారతదేశమందు
నేనొక మహాత్మునగుచు జన్మింతు వేగ॥

కావున నీవిక నిశ్చింతనుండుము.
నీకు శుభము గల్గుగాత - పాపము శమించుగాత
(నిష్క్రమించును)

—ఆహా! ధన్యురాల నయితినిగదా?
॥ హరికారుణ్య సుధారసంబునను ధన్యంబయ్యె జన్మంబు, నా
నరసంతానము నుద్ధరింపగ జగన్నాథుండె భూమండలిన్
వరపూర్ణుండయి యుద్భవించి పటుపాపంబెల్ల బోగొట్టి భూ
రముగా మాన్పి, యొనర్చుగాక శుభములొప్పన్ లోకకళ్యాణమున్॥
(నిష్క్రమించును)

---

౨. రంగము.

దక్షిణాఫ్రికా భారతీయులు.

[కూలీలు స్త్రీ, పురుషుడు]

—అయ్యో, నేనీబాధపడలేను. మరల కూలివేళయగుచున్నది.
నేనేమిచేయుదును ఈ జ్వరబాధనే భరింపజాలను.
—ఏహో నాలుగుడబ్బులు సంపాదించుకొని పొట్టబోసుకొనువారితో
కొఱలమాటల నమ్మిమోసపోయి యీదక్షిణాఫ్రికా దేశమునకు

కటకటా ! వారిసమీపమునకు బోయి వారిస్థితి గనుగొందము. వారిముఖవైఖరులను జూడ వారేటికో దుఃఖించుచున్నట్లున్నారు.

(వారిని సమీపింతురు)

రాజ—అయ్యయ్యో, వాండ్లేవండ్లో అడగకుండా అంతదగ్గరకు పోతారేం

దా—సరే రామాయణంలో పిడకలాటగానున్నది. (వెనుకకుతగ్గును)

శ్వ—(వారి దెసఁజూచి) అయ్యా, మీరేల యిట్లీకాకులై పడియున్నారు.

రు—అయ్యా, యీదేశమున మేమందరమును ఏకాకులముగానే యున్నాము. మాగతి యేమని చెప్పుకొందుము?

శ్వ—మీరిట్లు వీధిలో పడియుండుట కేమి కారణము? మీకు నివసించుటకు గృహములేదా?

రు—అయ్యా, మాకు గృహమక్కరలేదు. ఈచెట్లక్రిందనైనను హాయిగా పడియుండనిచ్చిన యెడల సంతోషాలును.

రాజ—మీదేకులం అబ్బీ?

రు—మాది యేకులమని చెప్పుకొనుటకు సిగ్గుగానున్నది. ఏకులము వారికైనను ఇచ్చుట యుదేరాత.

రాజ—చెప్పరానివాండ్లుకాదు గదా!

రు—ఒక్క చెప్పరానివాండ్లమే గాదు - చూడరానివాండ్లము - వినరానివాండ్లము - బ్రతకరానివాండ్లము గూడనైయున్నాము. మేమేగాదు. మనదేశస్థులందరు నిచ్చుటనట్టివారే. ఈ ప్రదేశమునకు హాయిగా బ్రతుకు మీరుగూడ నేలవచ్చితిరాయని నాకు విచారకరముగా నున్నది.

రాజ—అన్నయ్యా, మనవాడి సంగతి వీండ్లకు తెలుసునేమో విచారించు.

రు—అయ్యా, మీబంధువు లిచటెవ్వరైన నున్నారా?

ఆచా— అవును, మాతమ్ముని కుమారుడు చక్కపలచగా నల్లగానుంటాడు. పేరు శంకర శాస్త్రి. ఇక్కడికి సంవత్సరంకింద వచ్చినాడు. నీకేమైనా తెలియునా?

పురు— నేను వారిని చూచియుండలేదు. గనులదగ్గర విచారించిన వారిసంగతి తెలియును. కాని యింతవరకు క్షేమముగా నుందురాయని నాకు భయము గల్గుచున్నది.

ధర్మ— అయ్యా, మేమిచ్చటికి క్రొత్తగావచ్చి యున్నాము. మీస్థితిగతులు మాకించుక యెఱింగింపుడు?

పురు— మాస్థితి యేమని చెప్పకొందుము —

తే॥ గీ॥ కట్టుకొనుటకు గుడ్డయు, పొట్టకింత
కూడు, పడియుండుటకు యిల్లు కొంప
కూడ లేకుండ మేమిట్లు గోడుగోడు
మనుచు నల్లాడుచుంటిమో యున్నలార!

ఇంకా మాగతి వినుడు లేని,

సీ॥ రోజుకిరువదినాలుగు గంటలునుగూడ
చెమటగార్చుచు కూలిచేయవలయు,
అధికారియాజ్ఞల కదియేమి యిదియేమి,
యనినోరు తెరచి యనరాదవలదు,
పెండ్లి పేరంట మనునట్టి సంసార సుఖము నో సిచావవలయు,
గొడ్లకన్న నుమించి గొడ్డుచాకిరి జేసి
తెల్లవారలతృప్తి దీర్చవలయు,

గీ॥ నల్లవారంచు, నీగ్రో జనంబులంచు,
నీచులంచును దొరల కానిపలటంచు,
అడవిజాతుల పీరొక్కరనుచు మిగుల
హీనముగజూతు రక్కటా! హిందువులను॥

రాజ—ఆ, ఆడమనిషి పడియున్న దేల? శివశివా!

రు—అమ్మా, దీనికి నెలరోజులనుండియు చాలజ్వరము వచ్చుచున్నది. ఇట్లున్నను ప్రతిరోజు చెప్పినట్లు పనిచేసితీరవలయును. అయ్యా, అదుగో దొరలువచ్చుచున్నారు. మీరు రోడ్డుక్రిందికి రండు. వారు మీమర్యాద జూడరు.

(ప్రవేశము తెల్లదొరలు యిరువురు)

దొర—Allo—Fresh—Slaves—క్రొత్తబానిసలు—క్రొత్తబానిసలవలెనున్నారు. Dam Dirty fellows — Get down— Get down రోడ్డు దిగిపొండు—దొరగారు వచ్చుట కనబడ లేదా మీకు? చాలదూరముగా నుండవలయును— రోడ్డుమీద నడవరాదు, Get out — Get out.

రాజ—ఏం, మేము మాలవాండ్ల మనుకున్నారా- మాదిగవాండ్ల మనుకొన్నారా?

ఆదా—వాండ్ళు దగ్గరకు వస్తే మనం మంటుకు పోరకుంటామా? దుష్టులకు దూరంగా వుండమన్నారు.

(దూరముగా పోదురు)

2వ దొర—Bloody negroes–talking something: Drive them into the mines.

దొ—Don't talk–Bloody fools. నోరు యెత్తవద్దు- పదండి పదండి. గనులలో పనిచేయవలెను. త్వరగా నడవకపోయిన కొరడాదెబ్బలు తగులును.

ధర్మ—అయ్యా, మేము పరదేశముచూచి పోవుటకు వచ్చినాము మేము కూలీలముగాము, మమ్మునువదలి మీదారిని మీరు పొండు.

దొర—Nonsense. Drive the bloody beggars to the mines.

థ—Sir, We have come here on private business and we are not coolies. Please don't trouble us for nothing.

2దొర—First, keep out of the road—you bloody beggar you speak English?

1దొర—ముందు మీరు రోడ్డుదిగి మాటాడుడు—
(కూలీలవైపుజూచి) Oh, bloody thievesదొంగళ్లా దొంగలు
మీరు తప్పించుకొని వచ్చినారా. సరిసరి.
(కొరడాతో స్త్రీపురుషుల నిరువురను కొట్టును.
పొండు- పొండు-

పురు—అయ్యా నాభార్యకు చాలజబ్బుగానుండి మేమీరోజు వని పోలేదు. దయవుంచి క్షమించండి-

1వ దొర—( జబ్బు గిబ్బు తెలియదు. you rogues.- ముందు నడవండి-
(వారినలుగురిని కొరడాతో కొట్టుచుతీసుకొనిపోవుచున్నాడు)

ధర్మ— అయ్యా, అనవసరముగా వానిని కొట్టుడ కేల? కొంచెము దయతో చూడకూడదా

2 వ దొర—Shut up you beggar walk out-walk out first.
(అని వానిని గూడ కొరడాతో కొట్టును)

రాజ—అయ్యో, దేవుడా, యిదెక్కడికర్మం వచ్చిపడ్డదో- శివశి
(అనితొలగితొలగి పోవును)

1 వ దొర—అదే దానికి నాలుగు తగలనియ్ Nonsense మీరు నోరెత్తుదురేని మీయందరికి శిక్షచేయబడును.

ధర్మ—కానియ్యండి పాపం యెంతపెరగవలెనో అంత పెరుగుతుంది పోదాము రండి, యేమిచేసెదరో మనము చూదము.

ఆచా—అయ్యా, మమ్ముల నెందుకు చంపుతారు! నాలుగు

త్రైనా యిస్తాం మాదానిని మమ్ము పోనియ్యండి.

దొర—Bloody fellows. Go to the mines first : shut up on—go on.

రాజ—అయ్యో యెట్టికర్మం తెచ్చుకున్నాం రామ రామ (కొరడా తో కొట్టుచున్నారు,) (నిష్క్రమింతురు)

తెరపడును.

---

3వ రంగము.

---

యామినీసుందరి.

(స్వప్నావస్థ)

---

అమ్మా? నీవెవరు? జగన్మాత వనుచున్నావా?

యా—ఆహా! యేమనుచున్నావు? మీ కులము వారిలో నెల్ల ౛వు విద్యావంతురాలవై యందుకు ఫలిత మేమనుచున్నావా? మీకు లెంత నీచవృత్తిలో నున్నదో చూచితివా యనుచున్నావా? నన్నేమి చేయు మనెదవు? గాంధిబోధలు వినబడుటలేదా యని యడుగుచున్నావా? వినబడుచున్నవి - వినబడుచున్నవి—నేనేమి చేయవలెను! మొదట నీవృత్తిని మాని నీకులము నుద్ధరింప మనుచున్నావా? నీవు గావించిన ఘోరకృత్యముల దలచు కొనమనుచున్నావా? నీకు నరకభయము లేదా యనుచు న్నావా? సరిసరి నీమాటలు వినబడుచున్నవి. పోవుచున్నావా ఆగుమాగుము.

(కలవరపడి లేచి)

ఆహా! యేమి యీ చిత్రము! కన్నుల గట్టినట్లొక పుణ్యాంగన తాదెస చేయూపుచు నేమేమియో ముచ్చటించుచు క్షణములో మా

యమైపోయినది. ఏమిది! నేను కలఁగంటినా? ఎంతయో స్పష్టముగాను న్నదే. నిజముగా నెవరైన వచ్చియుండిరా? కాదు-కాదు-నామనోవేదనయే నాభావచంచలనమునకు కారణము. నిజమునకు నేనట్టి ఘోరకృత్యములఁ గావించితి!

తే॥ గీ॥ చేయరాని దుష్కృత్యముల్ జేసినాను
బలుకరాని దుర్భాషలఁబలికినాను
నడువరాని దుర్నడతల నడచినాను
కటకటా! నాకుముక్తి యింకెట్టుల గలుగు॥

సీ॥ పొరుపుల మెరిపించి నిరపరాధుల నెల్ల
వలలలో నేర్పున బట్టినాను
సంసారములను ధ్వంసము జేసి యిండ్లలో
పెనుఘోషఁగడు నేడిపించినాను
మాయలమారినై మహా నవాయకులను
దొంగదోపిడియట్ల దోచినాను
తుచ్ఛద్రవ్యపుటాశతో మానమును వీధి
యంగడిలోఁ బెట్టి యమ్మినాను
గీ॥ ఎట్టి నీచమునకు నొడిగట్టినాను
నీతిజాతులు రెండును నీటఁగల్పి
నాను, కటకటా! యెప్పటికైనగాని
కట్టికుడుపదే యీపాపకర్మ మెల్ల॥

ఇంక నాజీవితసౌఖ్యము నెంచుద మన్నచో:—

ఉ॥ మానసమిచ్చినట్టి యొకమాన్యునిపై హృదయంబునిల్పి యా
ప్రాణవిభుండె దైవమని భావమునందలపోసి భక్తితో
ప్రాణము నిల్చుదాక నిజవల్లభుసేవ మెలంగు నట్టి యా
మానిని జన్మజన్మయగు, మాదియు ధారుణినొక్కజన్మయే॥

దారిపోయెడువారి దాహంబుఁ జల్లార్చ
బోగమువారె తోల్బొమ్మలవని
పనికిమాలిన పట్టి వ్యర్థులాడుకొనంగ
బోగము వారె కీల్బొమ్మలవని
రూపాయితోనే కురూపియేనియు నెక్క
త్రొక్క బోగమువారె కుక్కబండ్లు
చిత్తచిదారంబుఁ జేర్ప బోగము వారె!
కుళ్ళుచుండెడు రొచ్చుగుంట లకట!

గీ॥ నాల్గువైపుల మురికినంతయును జేర్చి,
లాగుకొనుపట్టిమురికి కాల్వలును వారె,
నిండుపుగుగులుగల మేడిపండ్లు వారె,
బాపురే! వేశ్యకులటల బ్రతుకు బ్రతుకె!

ఉ॥ చొక్కపుకాయమున్, మిగుల సోయగపున్ గనుదోయి తళ్కులన్
గ్రొక్కడు లాలితంబు, కళకాంతులనీను ముఖాబ్జబింబమున్
సుక్కునవంతరంబు మెముజూచెడు వారెవరైన నుందురే
యక్కట! దిక్కుమాలిన వృథాబ్రతుకే గద వృద్ధవేశ్యకున్!

చివరకు మాగతి యధోగతి పాలైనది గదా!

ఉ॥ మానము లేనలేదు, ధర మాన్యతయంతకు ముందె లేదికన్
మానుమమా, హుళక్కి! యువమానము జాస్తి; సుఖంబయొచ్చుటన్
గానము; దేహదార్ఢ్యముడుగన్ బనిలేదు, యశంబ నాస్తి; సం
తానము సున్న; జన్మము, వృథాగద; ధారుణి వేశ్య కాంతకున్

కటకటా! నాముసలమున సన్యాసినైయె నాగరత్నం యిల్లువాకిలి
వాల్లక తిరుగుచుండ యింటిలోనివారు నన్నెంతతిట్టిపోయుచున్నారో
గదా! అహా! కుశాలరావు తాగుమోతైతె తనయాస్తినంతయు నమ్ముకొని
మత్తిభమతో జేరదిమ్మరినైనందు కతని భార్య నాపై నెంత దుమ్ము

తూరుపారబట్టుచున్నదో గదా! ఇట్టి వందలకొలది పురుషుల యసువు
పోసికొనిన నాజన్మ కిక పుణ్యమెట్లు లభించును! నాకా యసుబా
యెట్లు తొలగును!

సర్వసంగపరిత్యాగమును గావించిన స్వార్థత్యాగియు, మానవ
శ్రేష్ఠుడును, మహాత్ముడును, పరమేశ్వరుని పరావతారమూర్తియు నగు
మహాత్మగాంధిబోధ లికనైనను నాచెవుల నాటవలదా? ఛీ-ఛీ-నా
నిచో నింక నాబ్రతుకేటికి? నాజన్మప్రాయశ్చిత్తమునకు దారియెట్లు?
నాకొకటియే దారితోచుచున్నది. మొట్టమొదట నాతుచ్ఛభోగమున
తయుత్యజించి పవిత్రురాలనుగావలను. పిమ్మట నావలన భ్రష్టులైననా
రత్తం, కుశాల్ రావు మున్నగువారి యాస్తులను మరల వారికిచ్చి
విశ్వప్రియత్నముల జేసి వారిదుర్బుద్ధి మాన్పి వారిసంసారమును నిలువ
బెట్టవలయును. ఆపిమ్మట నాజీవితమంతయు నాకుల స్త్రీల నుద్ధరించి
వారిని సన్మార్గమునకు మరల్పుటకు వినియోగించ వలెను. ఇక నాకు
మనోనిశ్చయము చేకూరినది.

ఇకనీతుచ్ఛపు విదేశవస్తులతో నాకుపనిలేదు. మహాత్మునా
నుసారము రాట్నపు నూలుతో తయారు జేయబడిన ముతకబట్టల
ధరించెద ఈ నా యాభరణములన్నియు దేశీయోద్యమమునకు మహాత్ము
నికి సమర్పించెద. ఇదియే నా మనోనిశ్చయము. శ్రీహరీ, దయాదీన
రాలిని కటాక్షింపుము. (నిష్క్రమించును)



## 4 రంగము.

[ప్రవేశము నందుడు.—(జాగా)]

నం—అహా! దురదృష్టవంతులను బాగుచేయు వారెవరును లేరుగదా!

తే॥ గీ॥ పూర్వమతమున నగచాట్లఁ బొగిలిబొగిలి
క్రైస్తవమతంబుఁ జేరఁ దక్కుడనుగూడ
దప్పవయ్యెను మాకున్న తిప్పలన్ని
బాపురే! పంచముల దౌర్భాగ్యమితుకె దలఁప॥

తే॥ గీ॥ పంచములటంచు మమ్మువగించు టొకటి,
క్రైస్తవులటంచు మతబహిష్కార మొకటి
రెండువిధముల వేధించుచుండె మమ్ము
కనికర మొకింత లేక మాకర్మమేమొ!

ఈవిషయ మిట్లుంచ కొంచె మాలోచించినకొలదిని మాకొక పశ్చాత్తాపముగూడ కలుగుచున్నది.

ఉ॥ ఎప్పటినుండియో వెలయు హిందుమతంబును బాసి నేటికే
తిప్పలుగల్గెనో యిటుల త్రివత క్రీస్తుమతంబులోన మే
మిప్పుడు కాలుజారి తపియించుచునుంటిమి యిట్టులింక మా
కెప్పటికేని ముక్తిలభియించునొ లేదొ యికేమి మూడునో॥

ఈమతమువలన మాకు కొన్ని స్వల్పమేలులు కలిగినమాట సత్యమేగాని, దీర్ఘముగా నాలోచించి చూచిన మాకిప్పుడు గూడ నెట్టి సౌఖ్యము గనుపించుట లేదు:—

మాటమాత్రమెగాని మము తెల్లవారితో
పాటు జూచెడు మాట; వట్టి కల్ల
కలుపుకొనుటగాని వారల సంఘమున మమ్ము
చేరనిచ్చుట చాలదూర మెపుడు
ఆశ పెట్టుటగాని యాదరమున మమ్ము

సం.— వారికి మాయెడ కటాక్షమున్నచో మేము కృతార్థులమగుదుము

ఆచా.— మాకటాక్షమున కేమిగాని, అచ్చట మనభారతీయుల దుస్థితి యింతయంతయని వర్ణింప నలవిగాకున్నది. వారచ్చట గ్రామములలో నివసింపరాదు. పలుగురితో కలసిమెలసియుండరాదు. సంసారమును సేయరాదు. ఇన్నియేల,—

ఉ॥ ఇచ్చట మాలమాదుగుల నెల్లరనే విధి జూచుచుంటిమొ మా
యచ్చట నల్లవారయిన హైందవులెల్లర నంతకన్న బల్
హెచ్చిన నీచతగా గనుచు హీనముగా వ్యధబెట్టి భూమిలో
నెచ్చటలేని ఘోరముల నెన్నియొ జేయుచునుందు రక్కటా!

ఊరక జూడబోయిన మేముగూడ వారి దుర్నయముల బారినుండి తప్పించుకొనలేక, అచ్చట స్వయముగా ననుభవించుచున్నప్పుడు మనదేశమున మాలమాదుగుల యగచాట్లిట్లే యుండునుగదా యని దలచుకొని విలపించెడివారము.

సం— అగ్రజాతులను గూడ మమ్ముజూచినట్లేజూచుచుందురా ?

ఆచా— అగ్రజాతులేమి. కడజాతులేమి. ఇక్కడియగ్రజాతులక్కడ కడజాతులకన్న హీనముగా జూడబడుదురు. ఎంతటి విద్యావంతులనుగూడ నక్కడదమ్మిడీకిగూడ గొరగానిచ్చుట లేదు.

సం— అయ్యా, మాస్థితికై మేము వగచుటయేగాక, అచ్చటి మనవారిస్థితి హృదయవేదనను గలిగించుచున్నది.

ధర్మ— అయ్యా, మీరీమధ్య చాల చదువుకొని హిందూమత శాస్త్రముల నెఱిగి క్రైస్తవ మతములోనుండియు మీపూర్వమతమునందు చాలనభిమానమును చూపుచున్నారని విని టెంతయు సంతసించుచున్నాడను.

సం— అయ్యా యజ్ఞానాంధకారమునబడి మాపూర్వమగు హిందూమతమును విసర్జించి యన్యమతస్వీకారమొనరించి పాపము మూటగట్టుకొంటిని. తమరెల్లనను నిన్నగా పాడి మన్నింపవ

ధర్మ— నందా! నిన్ను మేము మన్నించుటకుమారు నీవును నీవారెల్లరును మమ్ము మన్నింపవలె— వినుమని—

ఛండాలులని యెంచి సర్వదా మము సంఘ
ముస జేరనీకుంట మొదటితప్పు
మీనీచవృత్తిని మానిపింపగ విద్య
జెప్పింపకుండుటే గొప్పతప్పు
మాతోటిపాటుగా మనుజులగా నైన
మిమ్మెంచకుండుటే మేటితప్పు
క్రైస్తవమతములో గలయు నాడైన మి
మ్మాదరింపక యుండు టసలు తప్పు

తే॥ గీ॥ ఇన్నితప్పులు మా యందె యున్నవయ్య,
దైవవిధి నిట్లు పుట్టుట దప్పు నింక
వేరుతప్పుది మీయందు వెదుక లేము
సోదరా, తప్పులనుగాచి యాదరింపు॥

నం— శివశివా— యెంతమాట బల్కితిరి. బ్రాహ్మణోత్తములయి— వేద వేదాంగాదిసకలశాస్త్రపురాణేతిహాసములయందు దారితేరిన మీవంటి మహాపండితులు నాయంటి దీనుని యెడ నిట్లు బల్కుట పాడిగాదు; స్వామీ, మీపాదములకు సాష్టాంగ నమస్కారము లాచరించుచున్నాను. నన్ను రక్షింపుడు.

(అని దూరముగా నేలపై బడి నమస్కరించుచున్నాడు.)

[ధర్మసిద్ధాంతి ఆచారసిద్ధాంతి సమీపించి, అతనిని లేవనెత్తుచు)

ఆచా— నందా, నీవుకడజాతిలో జన్మించియు, జ్ఞానవంతుడవయి నీ కులమును, హిందూమతమునుగూడ నుద్ధరింప సమకట్టితివి, నీవింక కృతార్థుడవు. మీకులమునింతవరకు నధోగతిపాల్జేసి యెల్లమలకొట్టినరాళ్ళవలె నూరుకొన్న మాయందే లోపములు

న్నవి. నీయంటివారి నంటుకొనుట దోషమని యెంచుట మహా పాతకము.

నందా—అయ్యా, అట్లనకుము. మన దేశమునందన్ని మతములందును ఈపరస్పర కులభేదములున్నవి లోపము మీయందో క్రైస్తవుల యందుమాత్రమే లేదు. వేయేల, నేనెంతయత్నించినను మాలో మాకు మాలమాదుగులకే పొందు కుదురకయున్నది కావున భారత సంఘమునంతయు నుద్ధరించు భాధ్యత తమపైనున్నదే గాని, తమయందే లోపములు లేవు.

ధర్మ—అయ్యా, భారము మాయందే గాదు.

ఉ॥ వీరును మీమునుంగలసి మేదిని సఖ్యతతో మెలంగుచున్
దూరము పారజూచి మనతోటి జనంబులలోని లోపముల్
పైరణజేసి, దీనులను బ్రోవుచు, పాపము సంస్కరించి, యీ
భారత సంఘవృద్ధిని నవశ్యముగాంచగ ధర్మమో సఖా! ॥

నం—అయ్యా, తమతోటిసాటు దేశసేవ జేయుటకు నాప్రాణము నర్పింపసిద్ధముగానున్నాను. ఇక నాకీ క్రిస్టియను మతముతో సంబంధము లేదు. ఇదిగో ఈ క్రాసును తీసివేయుచున్నాను. హిందూదేశములోన పుట్టి పెరిగిన మాకు హిందూసంఘములో ముక్తి గలుగవలెగాని, యన్యథా విచారించుట యాత్మద్రోహము:

(తనలో-ధ్యానము నభినయించుట)

శా॥ ఓహిందూమతమా, నిను విడచి యేదో యన్యథాయెంచి నే
ద్రోహంబెంతయు జేసినాడ, నిక నా దుర్బుద్ధి మన్నించి నీ
సాహాయ్యంబిడి ముక్తిమార్గమున నాజన్మంబు ధన్యంబుగా
మోహాంధంబునుండి మేలుకొను సద్బుద్ధిన్ ప్రసాదింపవే!

అయ్యా, మీ మరందరికి నా హృదయ పూర్వక వందనము లర్పించున్నాను. (రాజమ్మ వైపు జూచి) అమ్మగారు మాయెడ కనికరము గాపి దాసునిమన్నించునని ప్రార్థించుచున్నాను.

శా:—నందా! ఇలాచారములు చేస్తావన నిన్ను నీకులము వారిని మేమెప్పుడైన హింసించినచో వది మనస్సులో పెట్టుకోకుము. నిజ్జంగా ఆ పాడు పోలంలో అగచాట్లు పడుతున్న వారిని జూచినా, మేము స్వయంగానే యనుభవించినా, మీ మా మావంటి వాంళ్ళే గదా యని నా కడుపు చెరువైపోయింది అదిగాక కేవలం ఋషివంటి మహాత్మాగాంధిగారే చెప్పంగా మాకు మట్టుకేం పట్టుకేమున్నది కాకపోతే మాలో మరీ చాదస్తం ముండటుంటే యింకా నాలుగు రోజులు పట్టుకేమస్తారు. నువ్వు మట్టుకు నేరే అనుకోవద్దు.

నం—అమ్మా తమ యనుగ్రహమునకు దాసుని వందనములు.

శా—నందా, యింక నీవు నీకులములో మాంసాది యాహార విసర్జనమునకును, నీచవృత్తిని మాన్పించుటకును, పరిశుభ్రమునకును పాటుపడవలయును. మేమును నీకు నీకులము వారికిని యన్ని విధముల తోడ్పడెదము. మేమిక పోయి వచ్చెదము.

శ్రీ—ముందు నిమ్న జాతుల నుద్ధరించిన గాని దేశము బాగుపడదని యిప్పటికి మనము గ్రహించితిమి. నందా, యింక నీజీవితమును సంఘోద్ధారణకై వినియోగించవలయును. నేనుగూడ నాశక్తి కొలది పాటుపడుటకు పరమేశ్వరు డనుగ్రహించుగాత. మేమిక పోయివచ్చెదము.

రాజ—ఇక మా స్త్రీలు మాత్రము ఈవిషయములో నకునిందపాలు గారు మమ్మాటికిగారు. అయినదానికి మనస్సులో మాత్రము వుంచుకోవద్దు. (ముగ్గురును నిష్క్రమింతురు.)

సం—

ఉ॥ పంచములార నేడు! మన భాగ్యవశంబున దేవునట్లు నే
తెంచి మహాత్మగాంధి, కడతేర్చను కష్టము లెల్ల, నింకనీ
కెంచగ బోకుడయ్య మనమే యగచాట్లకృశించినాము లో
నెంచుడు తోటి సోదరుల మెప్పటికైనను దిక్కటంచిరా

---

## 5 వ రంగము.

---

(ప్రవేశము మహామ్మద్ మస్తాన్)

మస్తా—అరే, భాయ్-సైతాన్. ఇదరావ్-ఇదరావ్.

(తెరలో-ఆతే సర్కార్-ఆతే.)

(ప్రవేశము సైతాన్)

సైతా—సలాం-సలాం-సర్కార్-సలాం.

మస్తా—అరే, మనకీ హిందూ మనిషికీ భాయ్-భాయ్-లడాయ్ గిడాయ్ నై-ఓ బడాబడాసాబ్-షౌకతాలీ మహాత్మాగాంధి సాహెబ్ బాయ్‌బాయ్ హోయ్‌వారు సెప్పినమాట మనకీ ముఖ్యం. దేఖో మనకీ హిందువులాస్తే అంతా ప్రేమ - ప్రేమ-లడాయ్ గడాయ్ నై-దేఖో-జావ్ జల్దీ జావ్-నీకి పోయి మునటేటయ్య శాస్త్రిగారికి సలాములు సెప్పి, యీ జాబు వారికిచ్చి, మన క్షమాపణాలో, వారికేదిరాయుంటే, యెక్కడ దయసేయ మనిసెప్ప లేకపోతే మనమే వారిదర్శనం సేస్తాం అని సెప్ప జావ్ జల్దీ జావ్ అరే ఖబడ్దార్ బే- ఖబడ్దార్ సాలా మరాదతో వుండా వాలి మాలుం హోయ్ జావ్.

సైతా— అచ్ఛా- సర్కార్- అమారే జల్దీ ఆతా హుం

(నిష్క్రమించుదును)

మస్తా—(ఆలోచనచేసి) నిజానికి, ఒకదేశంలో పుట్టినావాంళ్ళు లడాయి యేసుకుంటే, పరాయివాడికి అలుసు! అరే, మాకు మహమ్మదీయ మతంలో అందరిని ప్రేమించమనియున్నది. ఛాఛా - క్యాసూధామతి రే అమారే - ఒకదేశంపుట్టింది - ఒకచోటు పెరిగింది - ఒకచోటు ఉండేది - ఆంళ్లకీ మాకూ లడాయి! ఛాఛా - బుద్ధితక్వ - బుద్ధితక్వ, వారే! బడా బడా సాబ్ - యిప్పటికి మాకు కంళ్లు తెరిచారు! అచ్ఛా - అచ్ఛా - వారికి సలాంలు-సలాంలు-ఓ బడా-బడాసాబ్-బడాసాబ్-పరమేశ్వర్ సమూ హాయ్.—

ఆదా—మాకూ వాంళ్ళకు మతం యేరు. అయితే క్యా నష్టం? ఆంళ్ళ మతం ఆంళ్ళది-మాకూమతం మాది-వాంళ్ళ దేవుడూ వాంళ్ళకి మాకూ దేవుడు మాకూ-ఒకరికి ఒకరు సాయం చేసుకుంటూ భాయ్‌భాయ్ యంటే-మల్లీ కబడ్దార్ మల్లి దేశంలో అల్లరిగిల్లరి నై నై. అందరం కలసి భాయ్‌భాయ్ - సుఖంగా వుంటాది.

(ప్రవేశం: సైతాన్ ఓబయ్యశాస్త్రి)

ఆవ్ జీ-ఓబామ్మ సాబ్ ఆవ్.

సలాం-సలాం, బైటీ-బైటీ-ఇధర్-బైటీ.

తాన్:—సర్కార్—మనకీయేంచేస్తామోయనిమహారాజ్ దకుస్తా వుంటే మాకూ బాగాసెప్పి తీస్కొ వచ్చాం—బైఠో మహారాజ్—ఫికర్ నై-

బ:—నాకేమి భయము! మహాత్ముని బోధలవలన మేము నిశ్చయముగా మహమ్మదీయులయెడ సోదరభావముతోనుంటున్నాము. వారుమాయందు చాలమర్యాదతో నుంటున్నారు.

మస్తా:—అచ్ఛా - అచ్ఛా- సలాం మహారాజ్, సలాం- మాకి యిదివరకు మిమ్ముల్ని దూషించి నందుకు తమరుక్షమించాలి. మనంమనం అన్నదమ్ములవలె నుండాలీయని మాకుగూడ బుద్ధి వచ్చింది.

ఓబ—అయ్యయ్యో క్షమించుట కేమున్నది మాయందు మాత్రములో పములు లేవా-అదొక కాలవిపరీతం- మళ్ళీ మహాత్ముడువచ్చాడు అందరము క్రమంగా బాగుపడుతున్నాము. ఇదివరకు తురకలను ముట్టుకుంటే చర్మంకోసివేయవలెనని మేము తన్నుకొనిచచ్చాం. ఇప్పుడది విషమించి, పరస్పరవిరోధములు ఎక్కువగుచున్నవని తెలిసి బుద్ధితెచ్చుకొనుచున్నాము. మాకన్న మహమ్మదీయులే యెక్కువ మర్యాదతో మాయందున్నారు. ఎక్కడజూచినను మాగోవులను ముట్టుకొనమని వారు పట్టుదలవహించుచున్నారు.

మస్తా— ఛా-ఛా-ఛా- నాదీభారం-నాదీభారం- మా మహమ్మదీయుల ఆవుల జోలికి పోతే వాడికి సైతాన్ కిఅప్పగించి వాడిని నరికివేస్తాం- మాలో కట్టు కట్టితే- మళ్లీ బందోబస్తి- అరే యేసువర్ అవ్రాజోలీకి పోతాడ్ బే, మాకినాల్క కోసియేయ్ మహారాజ్, ఇదిగో దేఖో- మాకూ ఖురాన్ నెత్తిన పెట్టికొనిగోవులను ముట్టుకోము ఎప్పటికిముట్టుకోము అని ప్రమాణం నేస్తాం. (ప్రమాణముచేయును) అరే సైతాన్ నీకీగూడా ప్రమాణం చేయ్ బే-

సైతా-అచ్ఛా సర్కార్ అచ్ఛా నాకీ ఆవుల్కి అసల్ ముట్టుకోం ఖురాన్ సాక్షిగా హింసజేయం మాకూ మాటసెత్తే-మళ్లీతియుగు లేదు

ఓబ—సంతోషము- సాయిబుగారూ, మేము మీకిదివర కేయపకారము చేసినా మరచిపోవాలి- ఇక మనం మనం సరిసమాముగా, అన్నదమ్ముల వలె నుండకగాని దేశము బాగు పడదు

మనకు సౌఖ్యం లభించదు. మనకూ మనకూనున్న అన్నితగాదాలు పరిష్కారము చేసుకొని రాజీపడవలసినదే.

మస్తా—అచ్ఛా-మహారాజ్- పీర్లపండగకు! మీకు మాకూ దెబ్బలాటలిక వుండవు. నాదీభారం.

ఠాబ—సరే, సాయిబుగారు సేనిక పోయివచ్చెదను.

మస్తా—బెత్తర్ మహారాజ్ సలాం-

ఠాబ—సలాం సలాం తమరుండండి (నిష్క్రమించును)

మస్తా— అచ్ఛా- అచ్ఛా- హిందూమహమ్మదీయులు- రెండూవకటైతే దేశంతప్పక బాగుపడుతుంది. నాదీభారం- మనకీమనకీ లడాయి పడితే మనకర్మం యెప్పుడూ యింతే- అరే సైతాన్ ఇంక మనకూపని, మనవాంళ్ళకు హిందువులకు స్నేహంచేయటం అన్ అవ్- పోదాంరా (నిష్క్రమింతురు)





# సంస్కారిణి.

## షష్ఠాంకము.

### 1 వ రంగము.

---

(ప్రవేశం నాగరత్నం చింపిరిగుడ్డలు వేసుకొని సన్యాసివలె)

నాగ — అహో! చివరకు నాకెంతగతిపట్టినది!

మ॥ ధనమా పోయెను, మానమా మొదలెసాంతంబయ్యె, సంసారయోగం
బును పైకెత్తగనీయదయ్యె, పరువా పోయెఁగదా యెన్నఁడో
యనుగుం భార్యయు దూరమయ్యెగద; సౌఖ్యంబా నశించెఁ గదా
మనమా వ్యాకుల పాటుజెందె; యిక జన్మంబా వృథాదోచెడిన్

కటకటా నాగతి దలచుకొనిన గుండె బ్రద్దలయి పోవుచున్నది.

సీ॥ గంపెడాస్తిని యొక్క క్షణములోపల పాడు
చేసికొంటి నికేమి చేయుఁ డ
కని పెంచినట్టి నాజననీజనకుల గ
ర్భము చిచ్చుపెట్టితి, గతి యికేమి?
బంధుమిత్రులనెల్ల పగ జేసికొనియు నే
నేకాకనైతి నింకేమిచేతు?
పరువు మర్యాదలు పాడయిపోవ బై
రాగినై పోతి కర్మంబికేమి

తే॥ గీ॥ వ్రతము చెడినను ఫలమైన ప్రాప్తమునిన
యెవరికై నేను నాసర్వ మిచ్చినానొ

వీగి శరీరము వుల్లయును పీనుగ రూపము దాల్ప జేసె, నిం
కేగల భూమిపై తిరుగుదు నేను మనుష్యుడనంచు జెప్పగా ॥

ఆహా! ఈ త్రాగుడు ప్రభావమేమోగాని

ఉ॥ ఎక్కడ లేని జబ్బు నిటులీగతి త్రాగుడు పైన బెట్టి, నా
బొక్కసమెల్ల నూడ్చి యలబోగము దాని మొగాన బెట్టి యా
యక్కనుపైన బంధుగుల సందరిమిత్రుల నెల్ల వీడి నా
చక్కని భార్య బాసి, యిటు సాంతము పాడయిపోతి నక్కటా!

కాబట్టియే మహాత్ముడు త్రాగుడు విషయములో నింత యఖండ ప్రయత్నముల జేయుచున్నాడు. నిజమునకు ప్రత్యక్షదైవమయిన ఆయనమాటలు వినిన వారికి జన్మజన్మములకు గతులు లేవు. నేనే ఆమహాత్ముని యాజ్ఞానుసారముగ నిశ్చయించు కొంటిని—

ఆ॥ వె॥ జన్మ జన్మములకు సారాయి కల్లును
ముట్టుకొనిన చెడ్డవట్టు నాకు;
హరిపదంబులాన మరువ నీప్రతినను
ప్రాణముండునంతవరకు నింక ॥

(ప్రక్కకు చూచి) ఓహోహో ఇతడు నాగరత్నం గాబోలు.

ఇంక నేనిప్పుడితని మొగం చూచు టెట్లు? యామిని సుంద యతని యెడ విముఖత జూపి నన్ను చేపట్టినను కాని విట్టివీగిటిని గాని, తుద కాతని గతియే నాకును పట్టినది. ఇతనికి నాకైనా గ్రహముండ తప్పదు. (సమీపించి భోరున యేడ్చుచు) నాగరత్నం చివరకు నాకును నీగతియే పట్టినది.

నాగ—ఇప్పుడు నాదగ్గరకు వచ్చి యేడిస్తే యేమున్నది! సన్యాసులు సన్యాసులు రాచుకుంటే బూడిద రాలునట్లున్నది.

కుశ—నీకు నేను ద్రోహం చేసినందులకు క్షమించవలయును. నీకు

మోసపోతివో నేనును అట్లే దానివలలో పడి సన్యాసినయి పోయినాను.

గ—మళ్ళీయెప్పటికైనా-

శ—బాబూ - ఇకబుద్ధివచ్చినది - జన్మజన్మాలకు ఈపాడు తొగుడు వ్యభిచారం- రెండూవద్దు, శాస్త్రిఅయింది, చాలు!

గ—ఏం, అంతఅకస్మాత్తుగా మార్పువచ్చింది?

శ—ఏమున్నది. మహాత్మగాంధిగారి యుద్యమము ననుసరించి,తాగుడుమాట తలుచుకోనని పట్టు పెట్టుకొని ప్రమాణం చేసుకున్నాను. ఇకయామిని వలన శాస్త్రియైన తరువాత యీప్రపంచం మీదనే విరక్తిపుట్టుచున్నది.

గ—సరే, యిక, నీతోచెప్పక పోవట మెందుకు - నాకూ బ్రతుకంటే చాలా విరక్తిపుట్టిపోయింది. ఇక యేమిచేయవలసినది తెలియటంలేదు.

శ—నాకు గాంధి మాటలు విని, మనజన్మ యికనైనా సార్థకము చేసుకొందామా యని యున్నది.

గ—యామిని మళ్ళీ యెవరినైనా చేపట్టిందేమో?

శా—నేనువినటం—అదికూడా గాంధిబోధ ప్రకారం తాను తన వృత్తినిమాని, తన కులమువారిని బాగుచేయుటకు ప్రయత్నించుచునని విన్నానుగాని, నాకుమాత్రం నమ్మకంలేదు. దానియంత మాయలాడి యికయుండబోదు. ఎవరా వచ్చేది! యామినీ గాదుగదా! (పారజూచి) ఆహా! యామినీయే! ఈయవతారం ఆశ్చర్యముగా నున్నదే.

(ఇరువురు వెలవెల బోవుచుందురు)

(ప్రవేశము యామినీ, ఆభరణములు తీసివేసి, ఖద్దరు గుడ్డలతో)

యా—అయ్యాతమకొరకై నేను వెదకుచున్నాను. తమ యిరువురు

నాకేచోటున లభించుటకై వీలయు. దీనురాలిని మన్నించెదర వేడుకొనుచున్నాను.

(నా॥ కు॥ ఇరువురు ఒకరివైపొకరు చూచుకొనుచున్నారు)

సీ॥ కొంపలెన్నింటినో కూల్చిన క్రూరాత్మ
రాలను మన్నించరయ్య నన్ను
కాపురంబులనెన్నొ గడపేర్చివట్టి పా
పాత్మురాలను బ్రోవరయ్య నన్ను
మానమంగడి బెట్టి మనుజులకమ్మిన
నీచురాలను కరుణించరయ్య
నిలబెట్టి మనుజుల నిలువుదోపిడిగొన్న
కటికిదానను దయగాంచరయ్య
గీ॥ కరువుమర్యాద లావలపారదోలి
బ్రతికియుండియు చచ్చిన భంగినున్న
దాస, దీనవైరిణిన్న దానవయ్య
నన్ను మన్నింప గాపాడు డన్నలార॥

కుశా—యామినీ, సహానసమై దిరుగుచున్న మమ్ము జూచి నీవు హాస్యములాడుచున్నదియు నిజములాడుచున్నదియు మాకు దోచుటలేదు.

యా—అయ్యా, చచ్చినపాము నింకేల చావగొట్టెదవు?

ఉ॥ హాస్యములాడి యూడి బ్రతుకంతయు పాడొనరించుకొంటి, నీ
హాస్యపుమారి వేశ్యనగుటన్నిటికన్నను మించినొక్కటే
హాస్యము. జీవితంబె గనుహాస్యము, నాదు చరిత్రమెల్ల యుగ్ర
హాస్యము, వేరుహాస్యముల నాడగ నేటికి యింక సోదరా॥

కావున, నోయన్నలారా, నన్ను మన్నించి గరుణింపుడు.

నాగ— యామినీసుందరీ,

తే॥ గీ॥ నాదు సర్వస్వమును నీదు పాదములని
యుంచి, నాకు జీవన్ముక్తినొసగ నీవె
గతి యనుచు నున్న నేను నీ కరుణజూడ
గలనె, సుందరీ, నీదయవలయుగాని!

కుశా— తే॥ గీ॥ ప్రేయసీ, నీకు ప్రాణమే నీయుటకును
సిద్ధమై నీకయి తపంబు జేసియున్న
యేన కరుణించవలె ననుటేటిమాట
నీవె కరుణించి నన్నింక బ్రోవవలయు!

యా— అయ్యా తమ రింకను ఇట్లు పలుకుట చాలవిషాదకరము—

ఉ॥ కాలపరిస్థితుల్ దెలియగా నభిలాషయె మీకు లేదొ, క
ల్లోలమడంచి ధర్మమున లోకము నేలు మహాత్ము నీతివా
క్యాలను మీ చెవిన్ జొరదొ, కామము మిమ్ము దహించివేసెనో,
యేలకలంక మేర్పరచి యావిధిసంఘము పాడుసేయగన్!

నాగ— ఓహో, ఇన్నిదినముల నుండియు లేని నీతు లిప్పుడు మా కొరకే వచ్చెను గాబోలు! సరిసరి యీమాయలు నే నిదివరకే యెరుగుదును.

యా— అయ్యా, ఇన్నిదినములనుండి నేను పవిత్రురాలనని చెప్పుకొనుటలేదు. అజ్ఞానాంధకారమున బడి మూఢులమై మన మిదివరకెన్ని పనుల జేసినను, జగజ్జ్యోతివలె దేదీప్యమానముగా నుదయించిన మహాత్మగాంధి జ్ఞానబోధ యను సూర్యోదయమైన తరువాతనైనను మనము కన్నులు విప్పగూడదా! అయ్యా, తమరు పురుషులు–నేను అబలను. తమకు నేను విన్నవించు శక్తిగలదానను గాను. తాము కొంచెము విచారించి చూచిన, నిజమునకు, భోగమువారికి పురుషుల సంభోగమునకన్న నిం

కాక యనన్యాయ ముండబోదు. భోగము వారి బ్రతుకేమియు న్నది. ధనముకై వేయి వేషములు వేసి పురుషులను మోసగించు చుందురు కావున.—

తే॥ గీ॥ ఓ! పురుషులార, పౌరుషంబున్న యెడల
పురుష నామంబు సార్థక పరచుకొనుడు,
నిమిష మాత్రంపు సుఖముకై నీతివిడచి
పురుషులను వాసి చెడఁ గొట్టఁ బోకుఁడయ్య॥

అయ్యా, తుదకు నామనవి యేమనిన,

సీ॥ అన్నలారా, యింకనైన మోహావేశ
మును వీడి మన దేశమును గనండి
అయ్యలారా, యిప్పుడైన దుర్మోహంబు
విడిచి వివాసంఘాభి వృద్ధిగనుడు
మనుజులారా, దేశమానంబు గాపాడ
వేశ్యలవృత్తి మాన్పింపరయ్య,
పురుషులారా, మీకు పురుషత్వమే యున్న
మోహంబునకు లొంగిపోకుఁడయ్య,
తే॥ గీ॥ సహజ ప్రేమానురాగముల్ చంపుకొనుచు
మాయనటనలలో మోసపోయి, యిట్లు
నాశనముగాక మీరు సంఘంబునెల్ల
నుద్ధరింపంగ రండు దుర్బుద్ధి మాని॥

అయ్యా, మనకింక :—

తే॥ గీ॥ ఆత్మసంస్కారమే మొదలౌసదంబు,
పిదప వేశ్యలవృత్తి మాన్పించి వారి

నుద్ధరించుటె మనకు విధ్యుక్తమగును,
సంఘసేవకుఁ గదలుడీ జాగికేల!

**ఉశా**—శేవ్-యామినీసుందరీ, నీవు మాకేగాక మాపురుషజాతికంత
కును బుద్ధివచ్చునట్లు పలికితివి. నీభావమెఱుఁగుటకయి యిట్లు
మెలంగితిమిగాని, మహాత్ముని బోధలు మమ్మునుగూడ కలవర
పరచుచునే యున్నవి. నీవలన మాకిప్పుడీ సద్బోధయు, నీతో
మా పూర్వ సంబంధమువలన మాకు మంచి గుణపాఠమును
లభించినవి. ఇంక పరమేశ్వరసాక్షిగా నీయెదుట నేనిదే దీక్ష
గైకొనుచున్నాను.

**తే॥ గీ॥** జన్మమున్నంతవరకు, నీశ్వరునిసాక్షి!
మోహమున కాశపడి మోసపోవనింక
బ్రతికినన్నాళ్ళు సంఘసేవకె మదీయ
ప్రాణమర్పింతు, నిదియె నాప్రతిన వినుము॥

(ఓ పురుషులారా, యింక మీరు నాగతిజూచి ముందే జాగ్రత్త
పడుదురు గాత!)

**నాగ**—యామినీ సుందరీ, నేనును కుశాల్‌రావు మార్గమునే యను
సరించుటకు నిశ్చయించుకొంటిని. ఇంక నేనును మీతోపాటు
సంఘసేవకు నాప్రాణము నర్పించెద. సర్వవిధముల పుడమిలో
జారత్వము నశించుగాత!

**యా**—సోదరులారా, తమ మనోనిశ్చయమునకు చాల సంతసము.
అయ్యా, తమవద్ద నిదివరకు నేనన్యాయముగ పుచ్చుకొన్న
యాస్తినంతయును మరల మీకర్పించుచున్నాను. క్షమింపుడు.
నాసొంత యాభరణములు పగయిరా సంఘసేవ కర్పించితిని.

**ఉశా**—నాయాస్తినిగూడ నందుకే వినియోగింపుము.

**నాగ**—నాదియు నట్లే చేయుము.

యూ—నాకే సంతసము. మనమింక మద్యపాననిషేధమునకు ధర్మసిద్ధాంతిగారు, ఆచారసిద్ధాంతిగారు మున్నగువారితో కలసి వెంటనే కృషిసల్పవలయును.

కుశా—అవశ్యము పోవుదము రండు. (నిష్క్రమింతురు.)

2 రంగము.

(ప్రవేశము: కొమ్ముల చౌదరి, రాఘవనాయుడు, ధర్మసిద్ధాంతి)

ధర్మ—అయ్యా, బ్రాహ్మణులపై మీకెట్టి ద్వేషమున్నను దేశక్షేమమునకై మద్యపాననిషేధోద్యమమున మీరేల పాల్గొనరాదో నాకు తోచుట లేదు.

చౌద—ఈయుద్యమము లెన్నియైనను బ్రాహ్మణులకేగాని మాకేమియు పనిలేదు. మేమిక బ్రాహ్మణుల వలలలో పడజాలము.

ధర్మ—అయ్యా మీరెంతయజ్ఞానమును వెలిబుచ్చుచున్నారు! ఈమద్యపాననిషేధోద్యమమును గూర్చి బోధించుచున్న గాంధిమహాత్ముడు బ్రాహ్మణుడా? లేక యితరులందరు బ్రాహ్మణులా? అదియునుగాక అంటరానితనము తాగుడు వగయిరాలు మాన్పించుచో బ్రాహ్మణుల కేమి లాభముండును. అందరితోటిపాటి వారును సుఖమపేక్షింతురేగాని, వారికి ప్రత్యేక లాభము లేమియు నుండవు.

రాఘ—మేమంతా అనుకోలం ఎందులోనైనా బ్రాహ్మణులు స్వార్థమునకు ప్రయత్నాలు అనుకుంటున్నాము.

ధర్మ—అది చాలపొరపాటు. దేశములో బ్రాహ్మణులు బహుస్వల్ప సంఖ్యాకులు. ఇతరులగుమీరే యధిక సంఖ్యాకులు కావున బ్రాహ్మణుల యాట లేమియు సాగనేరవు.

కాని మనకా భయమేమియునక్కరలేదు. మన సంఘాభివృద్ధి గాంచుటకై మనమెల్లర మేకగ్రీవముగా కృషిసల్పవచ్చును. ప్రస్తుతము స్వదేశీవస్త్రముల విషయమునను, పంచముల విషయమునను, తాగుడు విషయమునను మన మెల్లరము కలిసి పనిచేయుట కేమియభ్యంతరము లుండును?

చౌద—గాంధి మహాత్మునియందు మాకును భక్తిగలదుగాని, యీయపరగాంధులమని చెప్పుకొను బ్రాహ్మణులతో మాకు పనిలేదు. ఆ బ్రాహ్మణులను పూర్తిగా నణగద్రొక్క వలయును.

శర్మ—మీరు పొరబడి యుండవచ్చును. మీరొక్క విషయమును విచారించుడు. మనలో మనకెట్టి కుటుంబ కలహములున్నను, మంచిపనుల జేయుటకైనను మనమందర మొకటి గావలదా? పిల్లిపోరు పిల్లిపోరు పిట్టదీర్చినట్లు, మనము మనము కలహించుచో, మనయిరువురమును హాస్యాస్పదుల మగుదుము. ఇది సామాన్య కుటుంబ రహస్యము.

చౌద—అయ్యా, తాగుడు, పంచములు మొదలగు విషయములలో పనిచేయుటకు మాకేమియు నభ్యంతరము లేదు.

రాజ—మాకు బ్రాహ్మణులూ ఒకటే, బ్రాహ్మణేతరులూ ఒకటే-ఎవరిస్వలాభం వారు చూసుకుంటే, మాపని వట్టిదవుతుంది.

శర్మ—అయ్యా, మనకెవ్వరికిని ఆ భయములుండ నక్కరలేదు. మహాత్ముని యాజ్ఞాను సారము వర్తింతుమేని, యందరికిని సుఖము గలుగును. మనలో మన మైకమత్యముగలిగి సంఘసేవకు తోడ్పడుటయే కావలయును. తమరు బాగుగా విచారించుకొనుడు ఈరోజు ఆచారసిద్ధాంతిగారు మున్నగు వారెల్లరు దుకాణములవద్ద తాగుడు మాన్పించుటకై సమావేశముగా నున్నారు. మనము వచ్చుటకి పోవుదమురండు. నామనవి సావకాశముగా విచారింతురేని మీయనుమానములన్నియు తీరును.

(నిష్క్రమింతురు)

## 8 రంగము.

(కల్లుదుకాణము. గొండ్లవాడు)

[దుకాణములో జనము క్రిక్కిరిసియున్నారు. కల్లుముంత
త్రాగుచు కోలాహలముగా నున్నారు. వారిలో మాదిగ పెంటాయ
శూద్రి కోటయ్య (కూలివాడు) బ్రాహ్మణ పోకిరావు (నత్తిమీ
ముసుగువేసికొని జందెము బొడ్లోదోపుకొని) కాశింసాహేబు
[బండితోలువాడుం గూడ నున్నారు]

**కోట**—(ముంతచేతిలో పట్టుకొని) బలే, బలే, ఓరంకో - యిర్రు
లేంకల్లురా! బలే- బలే- బలే- ఎయ్యవయ్యా ఎయ్ - ఇం
నాలుగుముంతలెయ్- నీసొమ్మేంపోయింది? ఊడియకొ, యి
య్యాల మూడు బండ్లులాగి మూడు రూపాయలు దంచా
నీదయుంటే మల్లీ రేపు దంచుతా పోయ్ పోయ్ - అరే, వా,
వా, వా, మజా, మజా,

**కాశి**— అరే, మాకీ నాలుగు ముంతాలెయ్యవెయ్యా- ఇస్కి
లుం యేంగొస్తతం - తగిలిపించు వ్రాయ్ తగిల్ పించు
అరే కోటయ్య బావ్రాయి, యియ్యాల నీకినాకీ పందెం

**కోట**— అరే బావమరిది తమ్ముడి మొగుడు కూతురోయ్- చ
తావ్ రో చెడతావ్ నాకో పందెం గిందెం యేస్తే చద్వావని
మాటే- మల్లీ పిన్నె నా చెప్పుతో కొట్టాలి-నన్నైనా కొట్టాలి

**కాశి**— అరే మజా- మజా- మజా ఓరి బావ్రా-పాటపాడరో

**కోట**— యేసుకో-

— పదం —

అరె- కల్లంటే కల్లుకాదురా
దాని ఝోరుజాస్తి- కల్లంటేకల్లుకాదురా॥
యేసుకో-: యేసుకో- ఒరే యియ్యాళ్ళి కల్లంటే కల్లుకాదు

1 కూలినాలిచేసుకొని- నాలుగైను రూకల్ దెచ్చి, మేలురకం బలే కల్లు చాలచాలాముంత శేరులేస్తే ॥కల్లంటే॥

2 పొద్దుకూకులు కష్టంజేసి పొద్దుకూకగానెవచ్చి పెద్ద పెద్ద ముంతలెన్నో వద్దనక యేసుకుంటే ॥కల్లంటే॥

3 పెళ్ళాం బిడ్డలు వచ్చి గొల్లుమని గోలబెట్ట యెల్లే, ముండా, యనుచు వళ్ళు పగల గొట్టి తాగు ॥కల్లంటే॥

అరే బావమరిదోయ్ నేనిల్లుండా-రోయ్.

( స్పృహతప్పి పడిపోవును )

౧—అరే అన్నా అరే అన్నా - యీాడికి డోసు జాస్తిపడ్డదిరో-

( అని పట్టుకొనుచున్నాడు )

౨—మహారాజులు - ఉన్నవారు ఎక్కువతాగి పడిపోతే, మేము వున్నంతవరకు తాగుతాం! అంతేసేనలెండి, బాబూ-అంతేసేన.

(ప్రవేశం యెంకి యేడ్చుచు)

యెం—కటకటా! నేనేమి జేయగలను!

తే॥ గీ॥ కొంపలో నొక్కగింజయుగూడ లేదు,
బిడ్డలాకలిచే గోల బెట్టుచుండి
రకటా! యెప్పటికూలి డబ్బపుడెయిట్లు
తాగుడుకు బెట్టి యేడ్పింప దగునె మమ్ము॥

ఉ॥ గంపెడు బిడ్డలున్ బ్రతుకగావలె, మేమును పొట్టనిట్టులో
నింపుకొనంగ జూడవలె నీళ్ళనొ గంజినొ యున్నిజోసి కే
వింపగ, మాన రక్షణకు చీలికలైనను గట్టుకోవలెన్
కొంపకు నొక్క దమ్మిడియుగూడను జేరదిదేమి తాగుడో!

మ॥ ధనమూ, పాడయిపోవుచుండ, స్పృహయేదప్పంగ నేవీధిలో
ననొ క్రిందగా బడిపొర్లుచున్న పుడు ప్రాణంబెప్పు డేలండి క్రొం

నెత్తిగొరిగించి గాడ్దపై నిలిపినారు
వీధులందిప్పుడురటంచు వినగలేదె॥

తే॥ గీ॥ ఛీ, యిటులసిగ్గులేకుండ జేసినట్టి
పాపకృత్యంబునకు నిన్ను పండబెట్టి
నరికినను గాని దోషమెంతయును లేదు
నీచ, కులము నప్రఖ్యాతి నింపితౌర॥

ధర్మ—నందా, తొందర పడకుము. వీనికి మహాత్మునాజ్ఞానుసారము శాంతముగా బోధజేసి సన్మార్గమునకు మరల్చవలయు

పెం—అయ్యా గడ్డి తిని బుద్ధితెలియక యీతడవ జేసితిని, దొరలు మన్నించండి. ఇకెన్నటికి ప్రాణమున్నంతవరకు కల్లుదుకాణం కంళ్ళచూడను. ఈతప్పు మన్నించండి.

ఆచా—మేము నీపైననేమియు నధికారము వహించిమాటాడుట లేదు. కల్లు తాగుటవలన అనేకనష్టములుండుట వలనను, ముఖ్యముగా కోట్లకు కోట్లధనము పాడయి పోవుచుండుట వలనను మహాత్మగాంధిగారి యాజ్ఞానుసారము మేముమిమ్ము వినయపూర్వకముగా వేడుకొనుచున్నాము.

పెం— బాబూ గాంధిగారి పాదాలకు మొక్కుతా-ఆయనేమాపాలి దేవుడాలివచ్చాడు. ఇకెప్పుడు కల్లుతాగను- సామితోడు:

యా— అయ్యలారా అచ్చట జూడుడు! భర్త కల్లుతాగి యొడలెఱుంగక తూలుచుండ, భార్యదుఃఖించుచున్నది

ధర్మ—రండు-సమీపమునకు బోయి కనుగొందము. ( సమీపించి ) అమ్మా నీవెందుకు దుఃఖించెదవు ?

మొం—అయ్యా, మాయింటియజమానుడు పెట్టునగచాట్లకు దుఃఖించక నాబ్రతుకేమి యున్నది:—

మ॥ అకటా! యేమని చెప్పుదాన నిక దుఃఖంబొంద కెట్లుందు? రో
జుకు రోజుకు లభియించు డబ్బునలుకే శూన్యంబుగా తాగి, యిం

టికి మైకంబున జేరి, కూటికయినఁ లేకుండ నల్లాడు న
న్నొక పర్యాయము చూవగొట్టుచు నికెంతో బాధ నేడ్పింపఁగా!

చివరకు తాగి యెచ్చట పడిపోయెనో యని ప్రతిరోజు నీయ
నను వెదకి యింటికి గొని పోవలసివచ్చుచున్నది. బిడ్డ లాకలిచేనల్లాడు
చున్నారు.

ఆచా—కటకటా ! వీరిదుస్థితి యెంతదుర్భరముగా నున్నది. హా, పర
మేశ్వరా, యీతాగుడుబాధ తొలగించి మనుజుల నెప్పుడు
సుఖంప జేతువోగదా !

యా—అమ్మా, దుఃఖించి ప్రయోజనమేమి? యూరడిల్లు మూరడిల్లుము; మహాత్ముని బోధలవలన మనకష్టము లీడేరు రోజులు
సమీపించుచున్నవి.

ధర్మ—కటకటా ! లోననెందరున్నారో చూతుము. అయ్యా, తమ
రందరొక్కసారి యిట్లు దయచేయుడు.

(అందరు బయటికి వచ్చుచున్నారు. పోకీరావు మొగము కన
పరచకుండా తప్పించుకొని పోవుచున్నాడు- అప్పుడు)

శార—అదుగో- అదుగో- బ్రాహ్మణుడే నేనెఱుగుదును. ఆయన
పేరు పోకీరావు ఇదుగో, యిటురావయ్యా, బ్రాహ్మడా యి
టురా! పోతావేమయ్యా,

(పోకీరావు తలవంచుకొని నిలువబడును.)

అందరు ఆశ్చర్యమొందుదురు

శార—సిద్ధాంతిగారూ ఈయనటా, బ్రాహ్మడటా!

ధర్మ—అయ్యా, తాము నిజముగా బ్రాహ్మలే యైనచో నేను చాల
విచారించుచున్నాను!

పోకీ—అయ్యా ! మీ యందరికి నమస్కారములు చచ్చినపామును
చావగొట్టకుడు. ఇంక నేనేమియు చెప్పజాలను.

ఆచా—(చెవులు మూసికొని)శివశివా! యెంత ఘోర మెంతఘోరము!

ఉ॥ పాపము పాడుగాను! కడుం భారము గాగ జగంబె తల్లకిం
దై పడిపోవు నోయన కటా! యిటులగ్రకులంబువాడవై
యీపని జేసి నిప్పువగ నెంతొ పవిత్రతగన్న బ్రాహ్మణం
బే, పడగొట్టినాడవిక నేవిధిలోకము నిన్ను సైచెడిన్॥

తే॥ గీ॥ నీచ ఛండాల పుల్కస నిమ్నజాతు
లందు గూడను వర్జితమైన తుచ్ఛ
మద్యపానంబు జేసి బ్రాహ్మణ కులంబె
మంటఁగలిపితివయ్యొ కర్మంబిదేమి?॥

ధర్మ— ఆచారసిద్ధాంతి గారూ ఎవరైననేమి దురాచారమున దగుల్కొని భారతసంఘమంతయు పాడయి పోవుచున్నది. ఈ బ్రాహ్మణుడు నిండుపశ్చాత్తాపమును జూపించుచున్నట్లున్నాడు, అదికొంతనయమే (షోకీరావు వైపుజూచి) అయ్యా, యీక వేరు చెప్పవలసినదేమున్నది. మహాత్మునియత్యద్భుత ప్రబోధమున ప్రపంచమే త్రాగుడు మానుచున్న సమయమున నీసాంప్రదాయములను, నీకులమును, నీజాతిని పాడుజేయుట యమానుషకరమని వేరుగా నిక చెప్పనక్కర లేదు.

షోకీ— అయ్యా, ఇంకనూ చెప్పుటేటికి !

తే॥ గీ॥ తెలిసి తెలియక యజ్ఞానతిమిరమందు
నీతిజాతుల నెంచకితి నిపుడు
నేను గావించినట్టి యీనీచమునకు
శ్రీహరియె నన్ను బట్టి శిక్షింపకున్నె?॥

తే॥ గీ॥ కఠినమైన ప్రాయశ్చిత్తకర్మ జేసి
తప్పులన్నింటి మన్నించి దయను నన్ను

నుండి గూడ సర్వ శాస్త్రములు మద్యపానమును ఖండించుచున్నవి. ప్రస్తుతము [illegible] బోధలు విని సత్వరము తాగుడు మాని వేయవలెనని మిమ్ము ప్రార్థించుచున్నాను. మీరెల్లరు మహాత్ముని సాక్షిగా నిక తాగమని దీక్షగైకొన వలెనని నాకోరిక.

మస్తా—అరే- అరే- [illegible] క్యా-క్యా- (అనిచాటునదాగి యున్న కాశింసాయిబును పట్టుకొని యీడ్చుకొనివచ్చి) అరే, బాఛకో మన మహాత్ముని [illegible]లుపెట్టుకున్నకట్టు దిట్టంసాడూ సేకాంపుకే: సువర్- సువర్-

కాశిం—సర్కార్- తప్పాసీ [illegible] మాపీకాం రచ్చించాలి సర్కార్-

మస్తా—అరే - భోషిడీ బాత్ బో [illegible]ంది కట్టు అంటే ఒకటే కట్టా తాగుడువద్దూ అ [illegible]-బస్-బందోబస్తు - మళ్ళీ కక్కిన కూటికి వచ్చావ్-జే-పట్టూ పెట్టుకో భోషిడీ.

ధర్మ—అయ్యా, ఆగ్రహింపక నెమ్మదిగా బోధించుడు.

కాశి—సర్కార్-ఇంక మహాత్మాగాంధి మహారాజ్ - షౌకతాలీ మహమ్మదాలీగార్లతోడూ-నేనూ ప్రాణం వున్నంతవరకు తాగుడు మాట తెలుసుకోను. మా అల్లా సాక్షి-మళ్లీ గడ్డితింటే నా నోట్లో పందిమాంసం పెట్టండి మహారాజ్-మావాంళ్ళు యెవ్వరూ యింకా తాగరు. ఎవ్వరు ఆవులను ముట్టుకోరు హిందువులతో లడాయి చెయ్యరు. ఇది నిశ్చయం. అల్లా సాక్షి నిశ్చయం.

మస్తా—అచ్ఛా-అచ్ఛా-ఖబడ్దార్!

ధర్మ—

మ॥ దినముల్లన్ శ్రమజేసిజేసి నిజశక్తిన్ ధారవోయన్ లభిం
చిన ద్రవ్యంబును కల్లుత్రాగుటకు వెచ్చింపంగ మీపాలిట మె
ప్పిదదే, సోదరులార, యింటికడ మీపెండ్లామును బిడ్డలున్
ఘనతుద్బాధ తపింప దుర్వ్యయములన్ గావింతురే న్యాయమే!॥

అయ్యా మీరెల్లరు బాగుగా నాలోచించుకొనుడు.

**కోట**—అయ్యా, తమ రిందరు చెప్పినాక ఇక నాకు బుద్ధివచ్చింది. చెంపలేసుకుంటా! యికెన్నడు తాగను. దేవుడు సాక్షి.

**యా**—(అంగడివానివైపు జూచి) అయ్యా, నీకునట్టు కిదియే వృత్తియా? ఇంతమంది దీక్షగైకొనుచుండ, మహాత్ముడొక వంక ఘోషించుచుండ నీహృదయ మింకను కరగలేదా? అయ్యా—

తే॥ గీ॥ ఎందరున్నారు జగతిలో, నందరికిని
కల్లు సారాయి నమ్ముటే గలదె వృత్తి?
వారలంద రేదోవిధి బ్రతుకరొక్కొ
నీవుమట్టుకు జీవింపలేవె చెపుమ?॥

అయ్యా, దీనివలన యెన్నికోట్లధనము పాడగుచున్నదో, యెంత నష్టము గలుగుచున్నదో యింకను గమనించి ప్రత్యుత్తర మిమ్ము.

**ఆదా**—ఓయీ, నీకింక మేము వేరుగా నేమి చెప్పవలయును. మహాత్ముని బోధ గంటకొట్టినట్లు చెవులలో ధ్వనించుటలేదా? సత్వరము మాకు సంతసము గూర్పుము.

**ధర్మ**—అయ్యా, వెనుకముందాడిన ప్రయోజనము లేదు. మహాత్యాగమును జూపవలసిన తరుణము. మేముల్లరము నీప్రత్యుత్తరమునకు వేచియున్నాము.

**గౌండ్ల**—మహానుభావులారా, మీకందరికి నానమస్కారములు. నా తప్పునకు నన్ను మన్నించుడు. తమరిందరుండ నాకేమియు లోటుండదు. నాకింక యీపాడు వృత్తియే శాశ్వతముగాదు. ఇదిగో మీయెదుటనే యీకుండలను బద్దలుగొట్టి నా పాపమును బాపుకొనుచున్నాను. నేనింక పరమేశ్వరుని సాక్షిగా కల్లు సారాయి విక్రయించను. అవితాగను. నాకులము వారిని గూడ నట్లే జేయించుటకు ప్రయత్నించెద. ఇది నా నిశ్చితాభిప్రాయము.



ధర్మ—భీమ్ - మిత్రులారా, నేడింక మనకు దిగ్విజయము చేకూరినది. ఇట్లు జయమును బడసి లోకకళ్యాణము గావించుచున్నాము. ఈ సమయమున మనమెల్లర మేకగ్రీవముగా, జగన్మాత నొక్క-సారి ధ్యానించుదము.

ధ్యానము—కీర్తన.

మమ్ముగన్న తల్లివియో మాతృదేవీ! మ॥
మమ్మేలిరక్షించు మా జగన్మాతా॥ మ॥
మదినిను నిల్పెదమో లోకమాతా
మాపాలికల్పంబ మా పైడిమాతా॥ మ॥
దయతో నీలో మమ్ముం దగనిల్పుకోవే
శ్రీ పుండరీకాక్షు చిత్తాబ్జ తేజ॥

(జగన్మాత ప్రత్యక్షమై)

జయము-జయము-మీకు కళ్యాణమగు గాక! శుభమస్తు-శుభమస్తు తనయులారా!

భరత వాక్యము.

ఉ॥ శ్రీహరినామసంస్మరణ సేయుచు భూజనముల్ తరించుతన్
మోహమహాంధకారమున మున్గక జ్ఞానము తేజరిల్లుతన్
దేహమనోపవిత్రతయు తేజమహింస సదా వెలంగుతన్
ద్రోహమసత్యవైరములు దూరముగాగ సుఖంబుగల్గుతన్

# మంగళం.

జంగ్లా రాగం - ఆది.

మాముగన్నతల్లీ మంగళహారతిదే ॥మ॥

1 శ్రీజగదీశ్వరీ, మాజననీమణీ, భజనలగొను తల్లీ ॥మము॥

2 హే జననీ, మమునేలవే, బ్రోవవే, యికజాగసే తల్లీ
హే కల్పవల్లీ ॥మము॥

3 అఖిలప్రాణులకు సుఖమునుగూర్పగ, నతిశ్రమపడుదేవీ॥ మ॥

4 భూభరమును బల్మోసెడితల్లి, మాభాగ్యమునీవే॥ మ॥

5 భక్తితో దామరాడ్వంశజుడగు శ్రీపుండరీకాక్షుడు
ముదమున నొసగెడు॥ మంగళహారతిదే॥ మము॥

నమస్తే నమస్తేనమః

---

దామరాజు పుండరీకాక్ష నామధేయ ప్రణీతంబగు 'సంస్కారిణి' అను సాంఘిక నాటకమునందలి యారంకములు సర్వము సంపూర్ణము.

ఓం తత్సత్ బ్రహ్మార్పణమస్తు.